ఎలప్రాయంలోనే
పాపకు
నేర్పండి

# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్నీ అరికట్టుతుంది.



ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా రక్షిస్తుంది. ఇది దంత వైద్యునిచే సృష్టింప బడింది. ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన పదార్థాలు దీనిలో ఉన్నాయి. నియమానుసారం, రాత్రి, ప్రొద్దుట, ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకుంటే, ఇగుళ్ల బాధలు, దంతక్షయము మీ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం నేర్పటానికి ఇదే మంచి తరుణం. క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పటం ఉత్తమం. కావున, నేడే ప్రారంభించండి.

ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.




**ఫోర్‌హాన్స్**
దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్‌పేస్టు

---

**ఉచితము** "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పది భాషలలో*, మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ 10031, బొంబాయి-1 [illegible], వద్ద లభించును.

పేరు ________________ వయస్సు ________________

చిరునామా ________________________________



*పోస్టు ఖర్చులకై, 20 పైసల తపాలా బిళ్లలు పంపండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉరుదు, బెంగాలీ, తమిళం, తెలుగు, మలయాళం, కన్నడ భాషలలో ఏది కావాలో సూచిస్తూ, దాని క్రింద గీతగీయండి.

92F-183D TEL





ఉన్నత
ఆశయాలతో
ఉన్నారా?

వాడండి డీలక్స్ కేమెల్ ఇంక్






Vision 711 Tel



సత్యచిత్ర సమర్పించు

# తాసిల్దారుగారి అమ్మాయి

కె. ఎస్. ప్రకాశరావు

సత్యనారాయణ
సూర్యనారాయణ

కె. వి. మహదేవన్

యస్. వెంకటరత్నం M.I.C.A.

లక్ష్మీ కంబైన్స్

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

LAKSHMI





# చందమామ

సంస్థాపకుడు: నాగిరెడ్డి
సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలోని బేతాళ కథ ["ప్రేమ త్యాగం"] పంపినవారు కె. అన్వర్ బాషా. ప్రేమించటానికి స్వేచ్ఛ అవసరం. ప్రేమించేటందుకు స్వేచ్ఛలేని వ్యక్తి తన ప్రేమను త్యాగం చేస్తే అది నిజంగా త్యాగం అనిపించుకోదు.

ఈ సంచికలో "అబూ కీర్ — అబూ సీర్" అనే అరేబియా కథ ప్రారంభ మవుతున్నది. ఇది చాలా ప్రాచీనమైన కథే అయినప్పటికీ, ఇందులో వాస్తవికతా, నీతీ, మనుషుల మనస్తత్వమూ చక్కగా చిత్రించి ఉన్నాయి.

సంపుటి 50 జనవరి '72 సంచిక 1










అయుం నిజః పరోవేతి గణనా లఘుచేతసాం,
ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకం 1

[అల్పమైన మనసు గల వారికి, వీడు మనవాడూ, పరాయివాడూ అన్న భావం కలుగుతుంది. ఉదార పురుషులకు ప్రపంచమంతా తమ కుటుంబమే.]

ప్రత్యహం ప్రత్యవేక్షేత నర శ్చరిత మాత్మనః,
కిం ను మే పశుభి స్తుల్యం, కిం ను సత్పురుషై రితి 2

[నా ప్రవర్తన పశు ప్రవర్తన లాగున్నదా, సత్పురుషుడి ప్రవర్తన లాగున్నదా అని మనిషి రోజూ ఆత్మపరీక చేసుకోవాలి.]

సద్భి రేవ సహాసీత, సద్భిః కుర్వీత సంగతిమ్,
సద్భి ర్వివాదం మైత్రీ చ; నాసద్భిః కించి దాచరేత్ 3

[మంచి వాళ్ళతో కలిసి కూర్చో, సావాసం చెయ్యి, తగాదాపడు, స్నేహం చెయ్యి; మంచి వాళ్ళు కాని వాళ్ళతో ఏదీ పెట్టుకోకు.]

గుణం పృచ్ఛస్వ, మా రూపం; శీలం పృచ్ఛస్వ, మా కులమ్ ;
సిద్ధిం పృచ్ఛస్వ, మా విద్యాం; భోగం పృచ్ఛస్వ, మా ధనం 4

[గుణం అడుగు, రూపం అడగకు; శీలం అడుగు, కులం అడగకు; సాధించినది అడుగు, చదువు అడగకు; భోగం అడుగు, ధనం అడగకు.]

మంచితనం



# బండ శిష్యుడు

ఒక గ్రామంలో శివయ్య అనే ఆయుర్వేద వైద్యుడు ఉండేవాడు. ఆయన ఆయుర్వేదంలో గొప్ప పండితుడు. ఎలాంటి జబ్బునైనా నయం చేసేవాడు. ఆయన హస్తవాసి కూడా మంచిది.

శివయ్య ఉండే గ్రామంలోనే కామయ్య అనే వాడుండేవాడు. శివయ్యను రోగులు దేవుడి కన్న ఎక్కువగా చూసి గౌరవించటమూ, ఆయన ఎటువంటి రోగాలనైనా నయం చేస్తూ ఉండటమూ చూసి, కామయ్యకు తాను కూడా అటువంటి వైద్యుడు కావాలనీ, కీర్తి గడించాలనీ కోరిక పుట్టింది.

అందుచేత కామయ్య ఒకనాడు శివయ్య వద్దకు వెళ్ళి, నమస్కారం చేసి, "నాకు మీలాగే వైద్యం చెయ్యాలని ఉంది. మీ విద్య నేర్చుకోనివ్వండి," అని వేడుకున్నాడు.

ఈ మాటకు శివయ్య సంతోషించి, "నేను కూడా పెద్ద వాణ్ణి అయాను, బాబూ. ఎప్పుడైనా రాలిపోవచ్చు. నా అనంతరం నా విద్య ఎవరు కొనసాగిస్తారా అని చూస్తున్నాను. భగవంతుడే నిన్ను పంపాడు," అని, కామయ్యను శిష్యుడుగా చేర్చుకున్నాడు.

అది మొదలు కామయ్య శివయ్య ఇంటనే ఉండిపోయాడు.

శివయ్య తనకు కావలసిన ఔషధాలన్నీ తానే స్వయంగా తయారు చేసుకునేవాడు. శివయ్య ఔషధాలు తయారు చేసుకునేటప్పుడు కామయ్య ఆయనకు సహాయం చేస్తూ వుండేవాడు. శివయ్య అతనికి మెళుకువలన్నీ వివరంగా చెప్పేవాడు.

ఒకనాడు శివయ్య కామయ్యతో సహా ఒక రోగిని చూడబోయాడు. శివయ్యను చూడగానే మంచంలో పడుకుని ఉన్న రోగి లేచి కూర్చున్నాడు.

శివయ్య రోగి నాడి పరీక్ష చేసి, "ఏమయ్యా, నేను చెప్పిన ప్రకారం పథ్యం చెయ్యక

షేక్ మౌలాలి

పోతే నా మందు ఎలా పని చేస్తుంది? నీకు రోగం నయంకావాలా, వద్దా?" అని అడిగాడు.

"లేదు, బాబయ్యా. మీ రిచ్చిన మందు వేళ తప్పకుండా వేసుకుంటున్నాను. పథ్యం కూడా మీరు చెప్పినట్టే చేస్తున్నాను," అన్నాడు రోగి.

శివయ్య మరి కాస్త కోపంగా, "నేను నిన్ను చెరుకుగడలు తినమన్నానా? నువు ఎందుకు తిన్నావు?" అని అడిగాడు.

"తప్పు చేశాను, బాబయ్యా. నోరు చేదుగా ఉంది, రెండు గెనుపులు నమిలిన మాట నిజమే," అని రోగి ఒప్పుకున్నాడు.

అలా మరొకసారి చెయ్యవద్దని చెప్పి, శివయ్య రోగికి మందిచ్చి, ఇంటికి వచ్చాడు.

గురువుగారి తెలివి కామయ్యకు అద్భుతంగా కనిపించింది. అతను శివయ్యను, "గురువుగారూ, రోగి ఏమి తిన్నదీ నాడి చూస్తేనే తెలిసిపోతుందా?" అని అడిగాడు.

శివయ్య నవ్వి, "చూడు, కామయ్యా. వైద్యం చేసేవాడు కొంత భేషజం నేర్చి ఉండాలి. దానికి కొంత అనుభవంకావాలి. మనం వెళ్ళినప్పుడు రోగి మంచం కింద, నమిలిన చెరుకు పిప్పి కనిపించింది. అంటే రోగి చెరుకు తిన్నాడన్న మాట. ఇలాటి విషయాలు చదివితే తెలిసేవి కావు," అన్నాడు.

కామయ్యకు రహస్యం అర్థమయింది.

మరుసటి రోజు శివయ్య, కొలుకుంటున్న ఒకరోగికి మందు ఇచ్చిరమ్మని కామయ్యను పంపాడు. కామయ్య వెళ్ళేసరికి రోగి గడ్డివామి దగ్గిర మంచం వేసుకుని ఆరుబయట కూర్చుని ఉన్నాడు.

కామయ్య రోగి నాడిని పరీక్షిస్తున్నట్టు నటిస్తూ, "ఏమయ్యా. నీకు రోగం నయం కావాలా, వద్దా? గడ్డి తింటుంటే ఎలా నయమవుతుందీ?" అన్నాడు.

రోగికి ఒళ్ళుమండి కామయ్యను కర్రతో ఒకటి పెట్టాడు.

తరవాత ఈ సంగతి శివయ్యకు తెలిసి, కామయ్యను గట్టిగా చివాట్లు పెట్టి, తన ఇంటి నుంచి పంపేశాడు.





# దేవవీణ

ఒక గ్రామంలో రామకోటి అనే గృహస్థు ఉండేవాడు. ఆయనకు సంగీత మంటే చాలా ఇష్టం. ఏదన్నా పని చేసుకుంటున్నప్పుడు కూడా పాడుకుంటూ ఉండేవాడు. అయితే ఆయన పాడినప్పుడల్లా ఆయన భార్య విరగబడి నవ్వేది. ఆమె నవ్వటం చూసి రామకోటి నొచ్చుకునేవాడు. ఆమె ఇంట్లో ఉన్నప్పుడు పాడేవాడు కాడు.

ఒకనాడు రామకోటి భార్య పొరుగూళ్ళో ఉన్న తన పుట్టింటికి వెళ్ళింది. ఆ రోజు సాయంకాలం రామకోటి వంట ప్రయత్నం ప్రారంభించి, గట్టిగా గొంతెత్తి పాడుతున్నాడు.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు. రామకోటి లేచి వెళ్ళి తలుపు తీసేసరికి ముగ్గురు బాటసారులు కనిపించారు. వాళ్ళు దూర ప్రయాణం చేసి వచ్చినవాళ్ళలా డస్సిపోయి ఉన్నారు.

బాటసారులలో ఒకడు, "అయ్యా, మేము ప్రయాణం చేసి బడలి, ఆకలిగొని ఉన్నాం. మా కింత భోజనం పెట్టించారంటే మా దారిన మేము వెళ్ళిపోతాం," అన్నాడు.

"దానికేం భాగ్యం. లోపలికి దయ చెయ్యండి. దురదృష్టవశాన నా భార్య ఊళ్ళో లేదు. నాకు చేతనైన వంట చేసి పెడతాను. మీరు అదే పంచభక్ష్య పరమాన్నాలనుకుని తృప్తి పడండి. నా భార్యే ఉన్నట్టయితే మీకు నిజంగానే పంచభక్ష్య పరమాన్నాలు పెట్టి ఉండేది." అన్నాడు రామకోటి.

రామకోటి తనకూ అతిథులకూ వంట చేస్తూ ఉంటే, అతిథులు బావి దగ్గిర చేతులూ, కాళ్ళూ, ముఖాలూ కడుక్కొని వచ్చి కూర్చున్నారు.

వారిలో ఒకాయన, "మేము వచ్చేసరికి మీరేదో పాడుతున్నారు. మా రాకతో

బి. ఉమాపతి

మీ పాటకు భంగం కలిగింది. మీ కంఠం చాలా శ్రావ్యంగా ఉన్నది. కాస్త పాడండి, విని ఆనందిస్తాం," అన్నాడు.

తన భార్యకు నవ్వు తెప్పించే సంగీతం అతిథులకు నచ్చిందనే సరికి రామకోటికి పుట్టెడు సిగ్గు పుట్టుకొచ్చింది.

"ఏదో, తోచక పాడుకుంటాను. ఒకరికి వినిపించే పాటి పాట కాదు," అన్నాడు రామకోటి.

"అదేం మాట! చాలా చక్కగా పాడారు. రెండు పాటలు పాడండి," అన్నారు అతిథులు.

రామకోటి రెండు కాదు, చాలా పాటలు పాడాడు. వంట పూర్తి అయేదాకా అతను పాడుతూనే ఉన్నాడు.

వంట అయాక నలుగురూ కూర్చుని భోజనాలు చేశారు.

"ఈ పూట మాకు ఎలా జరుగుతుందా అనుకున్నాం. మీ దయవల్ల హాయిగా జరిగి పోయింది. మేమిక వెళ్ళి వస్తాం. కాని మీకు తీరని కోరిక ఏదన్నా ఉంటే చెప్పండి. మాకు సాధ్యమైతే తీర్చుతాం," అన్నారు అతిథులు.

రామకోటి కొంచెం సంకోచించి, "నాకు చాలా కాలంగా ఒక కోరిక ఉన్నది. 'చాత గాని వాడు వాయించినా రసస్ఫూర్తిగా పలికే వీణ ఒకటి ఉంటే ఎంత బాగుం డును?' అనుకునే వాణ్ణి. కాని అలాటి వీణలు ఎక్కడ ఉంటాయి?" అంటూ నిట్టూర్చాడు.



''ఆ గోడకు చేరబెట్టి ఉన్న వీణ మీదేనా?'' అన్నారు అతిథులు.

రామకోటి వెనక్కు తిరిగి చూస్తే నిజంగానే అక్కడ ఒక వీణ ఉన్నది. రామకోటి దాని దగ్గిరికి వెళ్ళి, ఆ వీణను చేతుల్లోకి తీసుకున్నాడు. అది మామూలు వీణ కాదు, దాని నిండా రకరకాల నగిషీలు చెక్కి ఉన్నాయి. రామకోటి తీగెలు మీటితే అతి శ్రావ్యమైన ఓంకారం పలికింది.

అతని దృష్టి వీణ మీద ఉన్న సమయంలో అతిథులు వెళ్ళి పోయి ఉండాలి. వాళ్ళు వెళ్ళటం రామకోటి గమనించలేదు. రామకోటి వీణ వాయించటానికి ఉపక్రమించాడు. అతను ఏ రసం కోరుకుంటే ఆ రసం వీణలో పలుకుతున్నది.

అతను వీణ వాయించటంలో నిమగ్నుడై ఉండగా అతని భార్య తిరిగి వచ్చింది. ఆమెతోబాటు కొందరు ఇరుగు పొరుగు వాళ్ళు కూడా వచ్చారు. అతని వాయింపు విని భార్య నవ్వలేదు. అతను వాయించటం ఆపేదాకా అందరూ తన్మయులై విన్నారు.

ఆ వీణ తనకు ఎలా వచ్చిందో ఊళ్ళో అందరికీ రామకోటి చెప్పాడు.

''వాళ్ళు మామూలు బాటసారులు కారయ్యా! ఎవరో దేవతలు! ఇది దేవ వీణ! దాన్ని భక్తితో చూసుకో.'' అన్నారు ఊళ్ళో వాళ్ళు.

అది మొదలు రామకోటి రోజూ ఊళ్ళో వాళ్ళందరికీ అడిగినప్పుడల్లా వీణ వాయించి వినిపిస్తూ ఉండేవాడు.



కొద్ది రోజులు గడిచాక రామభద్రయ్య అనే ఆయన రామకోటి ఇంటికి వచ్చాడు. ఈ రామభద్రయ్య ఒక రకం సంగీత విద్వాంసుడు. రామకోటి అస్తమానమూ పాడే పాటలను గురించి అందరితోనూ ఈసడింపుగా మాట్లాడేవాడు; "వాడి ముఖం! వాడు పాడేది సంగీతమా? లల్లాయిపదాలు! వాడికి రాగజ్ఞానం లేదు, స్వరజ్ఞానం లేదు," అని ప్రచారం చేసేవాడు. రామకోటికి ఆయన మీద బాగా కసిగా ఉండేది.

"ఏమిటి ఇలా దయచేశారు?" అని రామకోటి రామభద్రయ్యను అడిగాడు.

"ఏమీ లేదు. నీ వీణ గురించి అందరూ గొప్పగా చెప్పుకుంటుంటే విని, విందామని వచ్చాను," అన్నాడు రామభద్రయ్య.

"కూర్చోండి, వాయిస్తాను," అని రామకోటి వీణ తీసుకుని కరుణరసం ఉద్దేశించి వాయించటం ప్రారంభించాడు.

త్వరలోనే రామభద్రయ్య కళ్ళ వెంట అశ్రువులు కారసాగాయి. అంత కంతకూ ఆయనలో దుఃఖం పొంగి పొర్లసాగింది.

"రామకోటీ, ఆపు! ఆపు!" అని రామభద్రయ్య లబలబలాడాడు. ఆయన లబలబలాడుతున్న కొద్దీ రామకోటి మరింత కసిగా వాయించాడు. రామభద్రయ్య సొమ్మసిల్లి మూర్ఛపోయాడు.

రామకోటి రామభద్రయ్య ముఖాన నీరు కొట్టి ఉపచారాలు చేశాడు. రామభద్రయ్య కొంతసేపటికి తేరుకుని, కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఆయన వెళ్ళి పోయాక రామకోటి వీణ మీద ఏదో ఉల్లాసకరమైన ఆలాపన వాయించటానికి ప్రయత్నించాడు. కాని వీణ పలకలేదు. స్వరాలు మీటితే అన్నీ అపస్వరాలే!

మర్నాడు తెల్లవారేసరికి రామకోటి ఇంట్లో వీణ కనిపించలేదు. ఏమయిందని అందరూ అడిగారు.

"అది దేవ వీణ! రామభద్రయ్యను పీడించటానికి దాన్ని నేను ఉపయోగించి అపచారం చేశాను. అది ఎలా వచ్చిందో, అలాగే పోయింది!" అన్నాడు రామకోటి పశ్చాత్తాపంతో.





## 16

[విఘ్నేశ్వరపూజారి తనకు చిక్కిన ఖడ్గ జీవదత్తులను ఒక గుహాలయంలో బంధించాడు. ఆటవికుల ధాటికి తట్టుకోలేక నిత్యానందరాజు తన నగరానికి పారిపోయాడు. ఖడ్గ జీవదత్తులు తమకు కాపలా వున్న వాళ్ళను గుహాలయంలోని చీకటి గదిలోకి లాగి, గదిద్వారాన్ని రాతితో మూసి, గుహలోవున్న మెట్లెక్కి కొండ మీదికి చేరారు. తరవాత—]

కొండ మీద వున్న ఖడ్గ జీవదత్తులకు ఆనందపురం కేసి పోతున్న విఘ్నేశ్వర పూజారి ఎక్కిన రాకాసి ఏనుగూ, దానికి కొంచెం వెనగ్గా నడుస్తున్న ఆటవికులూ కనిపించారు.

"జీవా! మనం యీ దుర్మార్గుడైన పూజారిని హతం చేసి, నిత్యానందరాజును కాపాడాలి. బయలుదేరుదామా?" అన్నాడు ఖడ్గవర్మ.

ఆ మాటకు జీవదత్తుడు నవ్వి, "ఆ నిత్యానందరాజు పట్టి పిరికిప్రాణి! అలాంటి రాజును మనం యివ్వాళ, యీ విఘ్నేశ్వర పూజారి నుంచి కాపాడినా, రేపు ఏ మహేశ్వర పింజారో వచ్చి పదభ్రష్టుణ్ణి చేయక మానడు. పైగా, యీ గొడవంతా మనకు సంబంధించనిది!" అన్నాడు.

"మనకు సంబంధించనిదెలా అవుతుంది? మన దారికి అడ్డం వచ్చి,



మోసంతో ఆ దొంగ పూజారి మనను బంధించాడు. దానికి పగ తీర్చుకోవలసిందే!" అన్నాడు ఖడ్గవర్మ.

"అయితే పద, ఆలశ్యమెందుకు!" అంటూ జీవదత్తుడు మరొకసారి నగరం కేసి పోతున్న విఘ్నేశ్వరపూజారి గుంపు కేసి చూసి, కొండ దిగసాగాడు. ఖడ్గవర్మ అతణ్ణి అనుసరించాడు.

"మనం యీ గుంపు కంట బడకుండా కొంచెం ముందుగా ఆనందపురాన్ని చేరటం బావుంటుంది. అప్పుడు రాజును హెచ్చరించి, విఘ్నేశ్వరపూజారిని ఎదిరించేందుకు తగిన ప్రయత్నాలు చేయవచ్చు," అన్నాడు ఖడ్గవర్మ.

"నాకు ఆ రాజు ధైర్యసాహసాల్లో ఏ మాత్రం విశ్వాసం లేదు. ఈ పూజారి రాకాసి ఏనుగు మీద రావటం చూస్తూనే, అతడు కోట గోడను మరో వైపు నుంచి దూకి పారిపోయినా పోవచ్చు. ముందు మనం యీ ఏనుగును హతమార్చేందుకు తగిన పథకం ఆలోచించాలి," అన్నాడు జీవదత్తుడు.

"అదేదో మర ఏనుగులా నాకు తోస్తున్నది! నీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు ఖడ్గవర్మ.

"అది మర ఏనుగే కావచ్చు! కాని దాన్ని నాశనం చేస్తే తప్ప రాజుకూ, అతడి సైనికులకూ ఆత్మవిశ్వాసం కలగదు. లేకపోతే వాళ్ళు ఆటవికులకు నగరాన్ని ఒప్పచెప్పి, తాము అడవుల్లోకి పారిపోతారు," అన్నాడు జీవదత్తుడు.

ఇద్దరూ ఇలా మాట్లాడుకుంటూ విఘ్నేశ్వరపూజారి ముఠా వెనకగా ఆనందపురం కేసి కొంతదూరం నడిచారు. క్రమంగా పూజారి ఎక్కి వున్న ఏనుగు నగర ప్రాకారాన్ని సమీపించింది. దాని రాక చూస్తూనే నగర ద్వారప్రాంతాల వున్న ప్రజలు హాహాకారాలు చేస్తూ, తెరచి వున్న ద్వారం కుండా నగరంలోకి పారిపోసాగారు.

"ఖడ్గా! పూజారి కంట బడకుండా నగరంలోకి పోవటానికి యిదే మంచి అవకాశం.



మనం యీ దారి వదిలి, ఆ కనిపించే చెట్ల వెనగ్గా పోయి పారిపోతున్న ప్రజల వెంట నగరం ప్రవేశిద్దాం," అన్నాడు జీవదత్తుడు.

ఆ వెంటనే యిద్దరూ నగర ప్రాకార ప్రాంతాల వున్న చెట్ల కేసి పరిగెత్తి, అక్కడ వున్న జనంతో కలిసి, నగరద్వారం దాటి లోపల ప్రవేశించారు. ఇంతలో రాకాసి ఏనుగు ద్వారాన్ని సమీపించింది. ద్వారాన్ని కాపాడుతున్న భటుల్లో కొందరు పారిపోగా, మిగిలిన వాళ్ళు ద్వారాన్ని చప్పున మూసేశారు.

నగరంలో పెద్ద సంచలనం బయలు దేరింది. "రాకాసి ఏనుగు! విఘ్నేశ్వర పూజారి!" అంటూ కొందరు వీధుల వెంట పరిగెత్తసాగారు. ఆ గందరగోళానికి రాజు నిత్యానందుడు తన గది నుంచి బయిటికి వచ్చాడు. అతడికి వీధుల వెంట పరిగెత్తు తున్న ప్రజలూ, మూసి వున్న నగరద్వారం వెనక నిలబడి, ఏమి చేయుటమా అని ఆలోచిస్తున్న ద్వారరక్షక భటులూ కని పించారు.

రాజు నిత్యానందుడు భవన ప్రాంగ ణంలో వున్న సేవకుల్లొకణ్ణి కేక వేసి పిలి చాడు. వాడు పరిగెత్తుకుంటూ వచ్చి రాజుకు పరిస్థితి అంతా గబగబా చెప్పేశాడు. అంతా విన్న రాజుకు ముచ్చెమటలు పోశాయి. ఏ ఆయుధానికీ లొంగని ఆ రాకాసి ఏను గుతో విఘ్నేశ్వర పూజారి తన నగరంలోనే ప్రవేశించబోతున్నాడన్నమాట!

"ఒరే, నువ్వు వెంటనే పోయి సేనా నాయకుడితో సైనికులందరినీ నగరద్వారం దగ్గిర సమాయత్త పరచమన్నానని చెప్పు. నేనూ వస్తున్నాను. ఏనుగు ద్వారాన్ని పగల కొట్టకముందే సైనికులందరూ అక్కడికి చేరాలి!" అని చెప్పాడు నిత్యానందుడు సేవకుడితో.

"చిత్తం, ప్రభూ!" అని సేవకుడు అక్కణ్ణించి కదిలే లోపలే నగరద్వార ప్రాంతం నుంచి ధఢీధఢీ మంటూ పెద్ద ధ్వనులు ప్రారంభమయినై. విఘ్నేశ్వర పూజారి ఏనుగు తన తలతో ద్వారాన్ని పడ



కొట్టేందుకు ఢీ కొంటున్నది. దాని పక్కన ఆటవికులు పెద్దగా అరుస్తూ, ద్వారాన్ని బద్దలు కొట్టేందుకు రాళ్ళతో బాదుతున్నారు.

జనంతోపాటు రాజభవనం పక్కన వున్న వీధికి చేరిన ఖడ్గ జీవదత్తులు, భవనం మీద తన సేవకుడితో మాట్లాడుతున్న రాజు నిత్యానందుణ్ణి చూశారు. వాళ్లు రాజు దగ్గిరకు పోయి నగర రక్షణకు ఏదైనా ఉపాయం చెప్పుదామనుకునేంతలో, నగరద్వారం వైపు నుంచి భయంకరమైన ధ్వనులు రాసాగినై.

"ఖడ్గా! ఈ సమయంలో రాజును కలుసుకోవటం సాధ్యమయే పని కాదు. ఒక పావు గంటలో పూజారి ద్వారాన్ని బద్దలు కొట్టి నగరంలో ప్రవేశించవచ్చు. కనక మనమే ఏదైనా ఉపాయం ఆలోచించి వాణ్ణీ, ఆ రాకాసి ఏనుగునూ నాశనం చేయాలి," అన్నాడు జీవదత్తుడు.

"నా ఆలోచన కూడా అదే! రాజు ఏమైతే మనకేం? ఆ పూజారి దుర్మార్గుణ్ణి హతం చేసి మన దారిన మనం పోదాం!" అన్నాడు ఖడ్గవర్మ.

"వాణ్ణి ఆ ఏనుగుతోపాటు చంపటానికి మనకు ధైర్యం గలవాళ్ళు కొందరు సాయం చేయాలి. మనం ఆ ప్రయత్నంలో వుండగా వాడి ఆటవికమూక నగరాన్ని దోచి, అమాయకుల్ని చంపకుండా చూడాలి. ఈ పనికి పూనుకున్న తరవాత ప్రజల ప్రాణరక్షణ మన బాధ్యత అవుతుంది గదా! అదుగో, సైనికులు వస్తున్నారు! ఆ వెనక వచ్చే రథంలో వున్నది నిత్యానంద రాజేనా?" అన్నాడు జీవదత్తుడు.

"అవును, ఆ రథంలో వున్నది ఆ పిరికి వెధవే! వాడు రాజేమిటి — తరాజు!" అన్నాడు ఖడ్గవర్మ చీదరించుకుంటున్నట్టు.

అంతలో సేనానాయకుడు సైనికులతో పట్టణ ద్వారాన్ని సమీపించాడు. ఆ సరికి ద్వారంలో రాకాసి ఏనుగు దెబ్బల తాకిడికి కొన్ని చిల్లులు ఏర్పడినై. ఆటవికులు వాటిలో నుంచి లోపలికి బాణాలూ, ఈటెలూ విసురుతున్నారు. సేనానాయకుడు తన సైనికులను ద్వారానికి కొంచెం ఎడంగా నిలిపి,

ఏనుగు లోపలికి రాగానే దాన్ని ఎలా ఎదు ర్కోవాలో చెపుతున్నాడు.

రాజు నిత్యానందుడు రథంమీద వేగంగా వచ్చి తన సైనికుల వెనగ్గా దాన్ని ఆపించాడు. అతణ్ణి చూస్తుంటె ఖడ్గ జీవదత్తులకు ఎంతో జాలికలిగింది. రాజు ముఖంలో భయకంపితుడైన వాడి లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అతడి పక్కన మరొక వ్యక్తి కూర్చుని వున్నాడు. అతడి దుస్తుల తీరుచూసి మంత్రి అయివుంటాడనుకున్నారు ఖడ్గజీవదత్తులు.

"ఖడ్గా, నేనొక ఉపాయం ఆలోచించాను. రాజుతో మాట్లాడేందుకు యిదే మంచి సమయం, రా!" అంటూ జీవదత్తుడు రథాన్ని సమీపించి, "మహారాజా!" అంటూ గట్టిగా పిలిచాడు.

నిత్యానందుడు ఆ పిలుపు వింటూనే ఖడ్గ జీవదత్తుల కేసి చూసి అదిరి పడి, "మీరా? ఆ దుర్మార్గుడి వలలో చిక్కి ఎలా బయట పడగలిగారు?" అన్నాడు.

"మహారాజా, అదంతా యిప్పుడు కాదు, తరవాత చెపుతాం. పూజారి ఏనుగు ఒకసారి నగరంలో ప్రవేశించిందంటే, నీ సైనికులంతా చెల్లాచెదరుగా పారిపోతారు. అప్పుడు ఆటవికులు నగరాన్ని తప్పక కొల్లగొట్టి తీరుతారు. కనక ఉపాయంతో ఆ దుర్మార్గుణ్ణి జయించాలి." అన్నాడు జీవదత్తుడు.




"మహాయోధుడా, నువ్వన్నది నిజం! ఆ ఏనుగును చూస్తే మాకు యముణ్ణి చూసిన దానికంటె అధికంగా భయం కలుగుతున్నది. ఏమిటా ఉపాయం?" అని అడిగాడు నిత్యానందుడు.

"అది మీతో రహస్యంగా చెప్పవలసిన సంగతి. నన్ను రథం మీదికి రమ్మన్నారా?" అన్నాడు జీవదత్తుడు.

"నిరభ్యంతరంగా రావచ్చు. వీరు మా మహామంత్రి!" అంటూ నిత్యానందుడు తన పక్కన వున్న వ్యక్తిని చూపించాడు.

"అందరూ మహా మహా గాళ్ళే! పట్టి మహా మహా పిరికి వెధవలు!" అనుకున్నాడు ఖడ్గవర్మ తన మనసులో.



జీవదత్తుడు రథం మీదికి పోయి, "మహా రాజా! ఈ రథం మీద వెంటనే మీ ఉద్యాన వనానికిపోయి, అక్కడ వున్న ఏదైనా లతా గృహంలో దాక్కోండి. మీరు అక్కడ వున్నట్టు పూజారి నమ్మేందుకు వీలుగా రథాన్ని, ఉద్యానవన మార్గంలో ఎక్కడైనా వదలండి! ఆ దుర్మార్గుణ్ణి తుద ముట్టించే పని మహా మంత్రికీ, మాకూ వదలండి!" అన్నాడు.

నిత్యానందుడు నీ అభిప్రాయం ఏమిటన్నట్టు మంత్రి కేసి చూశాడు. మంత్రి ఒక సారి తలాడించి, "మహారాజా! ఈ యిద్దరు క్షత్రియ యువకుల బల పరాక్రమాల సంగతి నేను లోగడే విన్నాను. ఇక తెలివి తేటల సంగతంటారా? అంత కపటి యైన విఘ్నేశ్వర పూజారికి చిక్కకుండా తప్పించుకు రాగలిగారంటేనే తెలుస్తున్నది!" అన్నాడు.

"మహారాజా, మీరు ఉద్యానవనానికి వెళ్ళి వుండండి. ఒక ఎత్తు వేసి మేము పూజారిని ఏనుగుతోపాటు అటుకేసి నడిపి, దారిలోనే హతం చేస్తాం. మీ కెలాంటి భయమూ లేదు," అన్నాడు జీవదత్తుడు.

మంత్రి, జీవదత్తుడూ రథంనుంచి దిగారు. నిత్యానందరాజు రథాన్ని ఉద్యానవనం కేసి తోల మని సారథిని ఆజ్ఞాపించాడు. జీవదత్తుడు, మంత్రితో రహస్యంగా కొద్దిసేపు మాట్లాడి, ఖడ్గవర్మ కూడా వెంట రాగా, అందరూ కలిసి నగర ద్వారం దగ్గిరకు వెళ్ళారు. అక్కడ మంత్రి సేనానాయకుణ్ణి పిలిచి, ఖడ్గ జీవదత్తులను అతడికి చూపి, "ఈ క్షత్రియ యువకులు అడిగిన సహాయం అల్లా నువ్వు చెయ్యాలి. పూజారిని తుద ముట్టించేందుకు వీళ్ళిద్దరూ మంచి పథకం వేశారు. నేను మాత్రం యిక్కడే వుండి, పూజారిని ఉద్యానం వైపుకు వెళ్ళేలా ప్రోత్సహిస్తాను," అన్నాడు.

ఖడ్గ జీవదత్తులు, సేనానాయకుణ్ణి కొంచెం పక్కకు తీసుకుపోయి తమ ఎత్తుగడ అంతా అతడికి వివరించారు. వెంటనే అతడు ఒక ఇరవై మంది సైనికులను వెంట

పెట్టుకుని, వీధిలో నూనె మొదలైనవి అమ్మే దుకాణాల కేసి పోయాడు. ఖడ్గ జీవ దత్తులు కూడా వాళ్ళ వెనగ్గా నడిచారు.

మంత్రి ద్వారాన్ని సమీపించి అక్కడ కాపలా వున్న భటులతో తలుపు తెరవ మన్నాడు. ద్వార రక్షకులు కొంచెం ఆశ్చర్య పోయి, అయినా మంత్రిగారి ఆజ్ఞ గనక మరికొందరి సహాయం తీసుకుని ద్వారాన్ని బార్లా తెరిచారు. వాళ్ళకు ఎదురుగా రాకాసి ఏనుగు మీద విఘ్నేశ్వరపూజారి కని పించాడు.

పూజారి వున్న ఏనుగు ద్వారం దాటి లోపలికి రాగానే మంత్రి దాన్ని సమీపించి, పూజారితో, "విఘ్నేశ్వర పూజారీ! ఎలాంటి రక్తపాతం లేకుండా నువ్వు యీ ఆనంద పురానికి రాజువు కాబోతున్నావు. మా రాజు గారికి రాత్రి కలలో విఘ్నేశ్వరస్వామి కని పించి, స్వయంగా ఆయన్ని నీ తల మీద కిరీటం పెట్టమన్నాడట! రాజుగారిప్పుడు ఉద్యానవనంలో ఒంటరిగా వున్నారు. నీవు నిరాఘాటంగా అక్కడికిపోవచ్చు!" అన్నాడు.

"ఇందులో మోసం ఏమీ లేదుగదా?" అన్నాడు పూజారి అమితాశ్చర్యంతో.

"మోసం చేయదలిస్తే, నీకు నగర ద్వారం తెరిచి లోపలికి ఎందుకు రానిచ్చే వాళ్ళం? ఒకసారి నీ ఆటవిక భృత్యులతో నగరం ప్రవేశించిన తరవాత, నిన్నెవరూ యిక్కడ అడ్డుకోలేరన్న సంగతి నీకు తెలి యంది కాదు గదా? పోతే, నీ ఆటవికు లందర్నీ రాజభవనం ఆవరణలో కూర్చుని



విశ్రాంతి తీసుకోమని చెప్పు. లేకపోతే వాళ్ళు నగరాన్ని కొల్లగొట్టే ప్రమాదం వున్నది. ఇప్పుడు యీ మహానగరం నీది గదా?" అన్నాడు మంత్రి.

మంత్రి మాటల్లో విఘ్నేశ్వర పూజారికి పూర్తి నమ్మకం కలిగింది. అతడు ఏనుగు తలమీద పిడికిలితో గట్టిగా కొట్టి, "ఉద్యాన వనం కేసి నడు!" అన్నాడు.

రాకాసి ఏనుగు కదలబోయేంతలో మంత్రి చేతులెత్తి పెద్ద గొంతుతో, "విఘ్నేశ్వర పూజారీ, కొంచెం ఆగు! ముందు నీ ఆటవికులందర్నీ ఆ కనబడే భవన ప్రాంగణంలోకి పొమ్మని ఆజ్ఞాపించు. అక్కడ వాళ్ళకు కావలసిన ఆహారం, సారా సమృద్ధిగా భవన సేవకులు తెచ్చి యిస్తారు," అన్నాడు.

పూజారి ఆ మాటే ఆటవికులకు చెప్పాడు. వాళ్ళు ఎక్కడలేని ఉత్సాహంతో కేకలు వేస్తూ, భవనం ముందున్న విశాల ప్రదేశంలోకి పరిగెత్తి పోయారు. ఆ ప్రదేశానికి చుట్టూ చాలా ఎత్తయిన గోడ ఒకటివున్నది. ఆ గోడ పైభాగం పదీ పన్నెండడుగుల వెడల్పు కలిగి, కాపలావాళ్ళు తిరిగేందుకు వీలుగా వుంటుంది.

ఆటవికులందరూ ప్రాంగణంలోకి పోగానే మంత్రి, పూజారితో, "విఘ్నేశ్వరపూజారీ! నువ్వు లేని సమయంలో నీ భృత్యులు నగరం దోచుకునేందుకు ప్రయత్నించవచ్చు. అందుకని వాళ్ళున్న ప్రాంగణ ద్వారం తలుపులు మూయించి, బయట నీ వాళ్ళను కాపలా పెట్టు," అన్నాడు.

కిరీటం ఎప్పుడు నెత్తి కెక్కుతుందా, అని ఉవ్విళ్ళూరుతున్న పూజారి, మంత్రి చెప్పినట్టే చేశాడు. తరవాత రాకాసి ఏనుగు తల మీద గట్టిగా కొట్టి, "ఉద్యానవనానికి, ఊఁ!" అంటూ అదిలించాడు.

"ఇదేదో మానవభాష నేర్చిన ఏనుగులా వున్నది!" అనుకున్నాడు మంత్రి. అతనికి ఖడ్గ జీవదత్తులు పన్నిన వల విజయవంతం అయేలాగే కనిపించింది. ఆశాపాతకుడైన విఘ్నేశ్వరపూజారి తను చెప్పిన దానికల్లా తల వూపటం అతనికి అంతగా ఆశ్చర్యం కలిగించలేదు. —(ఇంకా వుంది)





# ప్రేమత్యాగం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, మానవులు పరిస్థితులకు బానిసలు కావటం సహజం. కాని కొందరు అకారణంగా కూడా త్యాగాలు చేస్తారు. ఇందుకు నిదర్శనంగా నీకు చంద్రనగరం రాజకుమార్తె అయిన చంద్రకళ వివాహం కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం లక్ష్మీపురం అనే రాజ్యాన్ని రాజేంద్రవర్మ అనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప యోధుడూ, పరాక్రమవంతుడూనూ. ఆయన తన మంత్రి అయిన జయసింహుడి సహాయంతో రాజ్యాన్ని చక్కగా పరిపాలిస్తూ, ప్రజలకు సుఖశాంతులు ఉండేటట్టుగా చూసుకునేవాడు.

*బేతాళ కథలు*



రాజుకు వీరవర్మ అనే కుమారుడూ, మంత్రికి తేజసింహుడు అనే కుమారుడూ ఉండేవారు. ఇద్దరూ ఒకే వయసువాళ్ళు, మంచి అందగాళ్ళు. ఒకే గురువు వద్ద ఇద్దరూ విద్యలన్నీ నేర్చుకుని, పౌరుషంలో జోడు సింహాలలాగా, ఒకరికొకరు తీసి పోకుండా ఉండేవారు. వారిద్దరి మధ్యా సోదరుల మధ్య ఉండేటంత మమకారం ఉండేది.

ఒక రోజు రాజు కొడుకూ, మంత్రి కొడుకూ తమ సరిహద్దులో ఉన్న అరణ్యాలలో వేటాడటానికి వెళ్ళి, మధ్యాహ్నం దాకా వేటాడి అలసిపోయి, ఒక పెద్ద మర్రి చెట్టు నీడలో విశ్రాంతి తీసుకున్నారు. రాజు కొడుకు నడుము వాల్చి నిద్రపోయాడు. మంత్రి కొడుకు చేత కత్తి పట్టుకుని, క్రూర మృగాలు ఏవీ రాకుండా రాజు కొడుక్కు కాపలా కాస్తున్నాడు.

అంతలో ఒక పులి గాండ్రించటమూ, ఒక స్త్రీ ఆర్తనాదమూ మంత్రి కొడుక్కు వినిపించాయి. తేజసింహుడు అటుగా పరిగెత్తాడు. ఒక అప్సరసలాటి స్త్రీ పైకి దూకబోతున్న పులి అతని కంట పడింది. మంత్రి కొడుకు వెనకపాటున వెళ్ళి, పులి పైన పడి, తన కత్తితో దాని గుండెల్లో పొడిచాడు. భయంకరంగా గాండ్రిస్తూ పులి ప్రాణాలు వదిలింది.

తనకు అంత సులువుగా చావు తప్పినందుకు ఆశ్చర్యపోతూ ఆ స్త్రీ మంత్రి కొడుకు కేసి కృతజ్ఞతతో చూసింది. మంత్రి కుమారుడు కూడా ఆమె అందానికి ఆశ్చర్యపోతూ ఆమె కేసి చూచాడు.

ఇద్దరూ మాట్లాడుకునేలోగా రాజకుమారుడు నిద్ర లేచి, కత్తి దూసి పరిగెత్తుతూ వాళ్ళున్న చోటికి వచ్చాడు. అతను మంత్రి కొడుకుతో, "నిద్ర లేచి చూస్తే నువు కనిపించలేదు. పులి గాండ్రింపు వినిపించింది. నువు పులివాత పడ్డావేమోనని భయపడిపోయాను!" అని అతను ఆ స్త్రీ కేసి చూసి, అమితంగా ఆశ్చర్యపోతూ, "ఎవరీసుందరి?" అని అడిగాడు.

"నాకూ తెలీదు. ఈమెను పులి నుంచి ఇప్పుడే కాపాడాను," అన్నాడు మంత్రి కొడుకు.

"నా పేరు చంద్రకళ. నేను ఇటుగా ఉన్న చంద్రనగరం రాజు కుమార్తెను," అన్నదా స్త్రీ.

"ఇలాటి అరణ్యాలలో నీ వంటి సుకుమారి సంచరించ వచ్చునా?" అన్నాడు రాజకుమారుడు వీరవర్మ.

"అస్తమానమూ అంతఃపురంలో కూర్చుంటే విసుగనిపిస్తుంది. అందుచేత గుర్రం మీద వనవిహారానికి బయలుదేరాను. అరణ్యంలోకి ఎక్కువ దూరం రాలేదు. ఇంతలో పులి గాండ్రింపు విని గుర్రం బెదిరి, ఆపినా ఆగకుండా అరణ్యంలోకి నన్ను తెచ్చింది. పులి ఎదురు పడనే పడింది. నా గుర్రం వెనక కాళ్ళ మీద లేచి, నన్ను పడదోసి, ఎటో పారిపోయింది. ఈయన ధర్మమా అంటూ నాకు వెంట్రుకవాసిలో పులి చేత చావు తప్పింది," అన్నది చంద్రకళ.

"నేను లక్ష్మీపురం యువరాజును. నా పేరు వీరవర్మ. ఇతను మా మంత్రిగారి కుమారుడు. పేరు తేజసింహుడు. మేమిద్దరమూ ఉదయం నుంచీ వేటాడి అలసిపోయి విశ్రాంతి తీసుకుంటున్నాం. ఈ విధంగా మనకు పరిచయం జరగటం చిత్రం," అన్నాడు రాజు కొడుకు.

"మీరు చేసిన మేలు మరవను. నన్ను మా ఇంటి దగ్గిర దిగబెట్టి, మా ఆతిథ్యం



స్వీకరించమని నా విన్నపం," అన్నది చంద్రకళ.

అందుకు రాజు కొడుకు సంతోషంగా ఒప్పుకున్నాడు. చంద్రకళను చూసిన క్షణం నుంచీ అతని మనసు ఆమె మీద లగ్నమయింది.

చంద్రకళ తండ్రి నరేంద్రవర్మ వీరవర్మనూ, తేజసింహుణ్ణీ అభినందించి, తన కుమార్తెను కాపాడినందుకు వారికి తన కృతజ్ఞత తెలుపుకుని, "మనం ఇరుగు పొరుగు వాళ్ళమైనా ఈ విధంగా మీరు మాకు అతిథులు కావటం తటస్థించింది. మన మధ్య మరింత గాఢమైన స్నేహం ఏర్పడటానికి ఇది మంచి అవకాశమయింది," అని చెప్పి, తన అతిథులకు రాజోచితమైన సత్కారాలు చేసి, తన పరివారాన్ని వెంట ఇచ్చి వారిని లక్ష్మీపురానికి సాగనంపాడు.

ఇంటికి చేరుతూనే వీరవర్మ తన తండ్రితో, "మన పొరుగు రాజైన నరేంద్ర వర్మ కుమార్తె చంద్రకళను నేను వివాహం చేసుకోవాలని నిశ్చయించాను," అన్నాడు.

రాజేంద్రవర్మ చాలా సంతోషించి, మంత్రిని పిలిచి, సంగతి చెప్పి, నరేంద్ర వర్మకు పెళ్ళి రాయబారం పంపమన్నాడు. మంత్రి ఒక ఉద్యోగి ద్వారా నరేంద్ర వర్మకు పెళ్ళి రాయబారం పంపాడు.

చంద్రనగరం రాజైన నరేంద్రవర్మకు, తన పొరుగు దేశపు యువరాజు అల్లుడు కావటమంటే ఆనందంగానే ఉన్నది. ఆయన వీరవర్మను స్వయంగా చూశాడు కూడానూ. అయితే ఈ మాట విని చంద్రకళ సంతోషించలేదు. ఆమె మంత్రి కొడుకును ప్రేమించింది. రాజు కొడుక్కు ఆమె హృదయంలో స్థానం లేకపోయింది.

నరేంద్రవర్మ లక్ష్మీపురపు రాయబారితో, "మా అమ్మాయి ప్రస్తుతం ఈ పెళ్ళికి అంత సుముఖంగా లేదని మీ మంత్రిగారితో మనవి చెయ్యి," అన్నాడు. రాయబారి తిరిగి వచ్చేశాడు.

తన కొడుకు మోహించిన చంద్రనగరపు రాజకుమార్తె అతన్ని పెళ్ళాడటానికి ఒప్పు

కోలేదని వినగానే రాజేంద్రవర్మకు విపరీత మైన ఆగ్రహం వచ్చింది.

"ఎంత అహంకారం! నా కొడుకు కన్న అందంలోనూ, ప్రతాపంలోనూ మించగల వాళ్ళు ఎవరున్నారు? అతడిలో ఏం లోపం ఉందని ఆ పిల్ల నిరాకరించింది? ఇది సహించరాని అవమానం. వెంటనే చంద్ర నగరం మీద యుద్ధం ప్రకటించండి. సైన్యంతోపోయి. ఆ నరేంద్రవర్మను యుద్ధంలో ఓడించి అయినా ఆ పిల్లను కోడలుగా చేసుకుంటాను," అని రాజు మంత్రితో అన్నాడు.

"తొందరపడకండి, మహారాజా! మరొక సారి సమర్థుడైన రాయబారిని పంపి కార్యం సానుకూలం అయేటట్టు చూద్దాం," అన్నాడు మంత్రి.

ఆయన ఇంటికి వస్తూనే తన కొడుకైన తేజసింహుడితో, "నాయనా, మన యువ రాజు పెళ్ళాడతానంటే చంద్రనగర రాజు కుమార్తె నిరాకరించింది. నువు వెళ్ళి ఆమెను పెళ్ళికి ఒప్పించిరావాలి. లేకపోతే ఉభయదేశాలకూ, మనకూ కూడా తీరని అపాయం కలుగుతుంది," అన్నాడు.

తేజసింహుడు చంద్రనగరానికి బయలు దేరి వెళ్ళాడు. అతను రాజును కలుసుకుని, రాజకుమార్తెతో మాట్లాడాలన్నాడు. నరేంద్ర వర్మ సమ్మతించాడు.



చంద్రకళ తేజసింహుణ్ణి చూసి పరమా నంద భరితురాలయింది. అతను ఆమెతో, "రాజకుమారీ, నేను మా యువరాజు తర పున పెళ్ళి రాయబారిగా వచ్చాను. నువు అతన్ని నిరాకరించినట్టు విన్నాను. అందుకు కారణం కనబడదు. అతను నవమన్మ థుడు. సాటిలేని పరాక్రమశాలి. నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాడు. అతను నాకు యజమాని మాత్రమే కాదు, ప్రాణమిత్రుడు. అతని ప్రేమ భగ్నం కావటం నాకు దుఃఖ కారణం. నువు అతన్ని పెళ్ళాడాలని మనస్పూర్తిగా కోరుతున్నాను," అన్నాడు.

చంద్రకళ చాలాసేపు తలవంచుకుని దీర్ఘంగా ఆలోచించి, చివరకు తలఎత్తి,

"మీ యజమానిని పెళ్ళాడటానికి ఒప్పు కుంటున్నాను. ఈ సంగతి మీ యువరాజుతో చెప్పండి," అన్నది.

తేజసింహుడి రాయబారం సఫలం కావటం లక్ష్మీపురంలో అందరికీ ఆనందం కలిగించింది. త్వరలోనే చంద్రకళకూ, వీరవర్మకూ వైభవంగా పెళ్ళి జరిగి పోయింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకు అనేక అనుమానాలున్నాయి. మంత్రి తన కొడుకును రాయబారిగా పంపితే పని జరుగు తుందని ఎందుకు అనుకున్నాడు? మంత్రి కొడుకును ప్రేమించిన చంద్రకళ యువ రాజును పెళ్ళాడటానికి ఎందుకు ఒప్పు కున్నది? ఆమె ప్రేమ నిజమైనదా కాదా? లేక తన ప్రేమను త్యాగం చేసిందా? త్యాగం చేస్తే దేనికోసం త్యాగం చేసింది? ఈ ప్రశ్న లకు సమాధానాలు తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చంద్రకళ తన కుమారుణ్ణి ప్రేమించిన కారణం చేతనే రాజకుమారుణ్ణి నిరాకరించి ఉండ వచ్చునని మంత్రి ఊహించాడు. అందుకే ఆయన తన కొడుకును పెళ్ళి రాయబారానికి పంపాడు. మంత్రి ఊహ సరి అయినది. చంద్రకళ తన ప్రేమను త్యాగం చెయ్య వలసిన స్థితి రానేలేదు. ఆమె ప్రేమించిన వాడు మరొకరి తరఫున పెళ్ళి రాయబారం వచ్చాడు. అతను తనను ప్రేమిస్తున్నట్టు రాజకుమార్తెకు సాక్ష్యం ఏమీ లేదు. అతను తనను పెళ్ళాడలేదన్నది కూడా ఆమెకు స్పష్టమయింది. అందుచేత ఆమె రాజ కుమారుణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకున్నది. ప్రేమను త్యాగం చేసినది చంద్రకళ కాదు, తేజసింహుడు. తన ప్రత్యర్థి తనకు బాల్య మిత్రుడూ, తనకన్నా ఎంతో ఉచ్చ స్థితిలో ఉన్నవాడూ కావటం చేత అతను తన ప్రేమను త్యాగం చెయ్యవలసి వచ్చింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# కోడళ్ళ తిరుగుబాటు

ఒక గ్రామంలో ఒక అవధాన్లుగారూ, భార్యా ఉండేవారు. వారికి ఒక పెద్ద ఇల్లూ, కొంత భూవసతీ ఉండేది. వారికి ముగ్గురు కొడుకులు. ముగ్గురు కొడుకులూ ఉదయం ఇంటి వద్ద భోజనాలు చేసి, దగ్గిరలో ఉన్న పట్టణాలకు వెళ్ళి, ఉద్యోగాలు చేసుకుని, తిరిగి చీకటి పడే వేళకు ఇంటికి వచ్చేవారు.

గ్రామం గుడిలో రోజూ పురాణం చెప్పేవారు. అవధాన్లుగారూ, భార్యా సాయంకాలం వేళ పురాణం వినటానికి వెళ్ళి, చీకటి పడ్డాక బస్తీ నుంచి తిరిగి వచ్చే కొడుకులతో సహా ఇల్లు చేరుకునేవారు.

అవధాన్లుగారి ముగ్గురు కొడుకులకూ పట్నంలోనే పెళ్ళిళ్ళు అయాయి. భార్యలు కాపరానికి వచ్చారు. వాళ్ళు ముగ్గురూ పట్నంలో పుట్టి పెరిగిన వాళ్ళు. వాళ్ళ భర్తలు పట్నంలోనే ఉద్యోగాలు చేస్తున్నా వాళ్ళు పల్లెటూరి జీవితం గడపవలసి వచ్చింది. ఇది వాళ్ళకు నచ్చలేదు.

సాయంత్రం పూట అత్త మామలు పురాణం వినటానికి వెళ్ళి, చీకటి పడ్డాక తమ భర్తలతో ఇంటికి తిరిగి వచ్చే మధ్యకాలంలో ఆ తోడికోడళ్ళు తమ కష్ట సుఖాలు మాట్లాడుకునేందుకు బోలెడంత సావకాశం ఉండేది.

"ఈ దిక్కుమాలిన పల్లెటూళ్ళో ఏమీ తోచదు," అన్నది పెద్ద కోడలు.

"అవును, అక్కా. ఈ ముసలాళ్ళ మూలానే మన మొగుళ్ళు ఈ పల్లెటూరు వదలకుండా ఉన్నారు," అన్నది రెండోది.

"మా ఆయన పట్నంలో ఉద్యోగం చేస్తున్నాడనేగదా నన్ను మావాళ్ళు ఇచ్చారు? పల్లెటూరి గబ్బిలాయి లాగే బతుకుతానని తెలిస్తే మా వాళ్ళు నన్నిక్కడ ఇవ్వకనే పోదురు," అన్నది మూడోది.

నెమ్మాని లక్ష్మి

మొగుళ్ళను పోరి, వాళ్ళచేత బస్తీలో కాపరం పెట్టించటం సాధ్యమయేపనికాదు. ఎందుకంటే, అందుకు పెద్ద వాళ్ళు ఎంత మాత్రమూ ఒప్పుకోరు. కొడుకులేమో, తల్లిదండ్రుల మాట జవదాటరు.

"ఆ మాటకు వస్తే, మనం మాత్రం ముసలాళ్ళ మాట జవదాటుతున్నామా?" అన్నది ఒకతె.

"అందుకే మనం మరీ అలుసు అయిపోయాం," అన్నది మరొకతె.

"వాళ్ళు చెప్పిన పనులు మనం చెయ్యకపోతే ఏమవుతుంది?" అన్నది మూడోది.

"అత్తమామల మాట వినటం లేదంటే, మన వాళ్ళే మనని తిడతారు," అన్నది ఇంకొకతె.

"వాళ్ళు చెప్పినపని చెయ్యాలి. కాని చెప్పినంతవరకే చెయ్యాలి. ఏ పనీ అసాంతం చెయ్యగూడదు. ఇదొక రకం తిరుగుబాటు. అలా చేస్తే ముసలాళ్ళకు మనతో ప్రాణం విసిగి, మనని వేరే కాపరాలు పెట్టుకోనిస్తారు," అంటూ పెద్దకోడలు మిగిలిన ఇద్దరికీ ఒక పథకం చెప్పింది. అది చాలా బాగుందనీ, అలాగే చేస్తామనీ మిగిలిన కోడళ్ళు కూడా అన్నారు.

ముగ్గురు కోడళ్ళూ తిరుగుబాటు ప్రారంభించారు. అత్తగారు ఒక కోడలును ఇల్లు చిమ్మమనేది. ఆ కోడలు ఈ గదిలో దుమ్ము ఆగదిలోకీ, ఆ గదిలో దుమ్ము ఈ గదిలోకీ చిమ్మి, "ఇల్లు చిమ్మాను, అత్తయ్యా!" అనేది.



మామగారు మడిబట్ట ఆరవెయ్యమంటే మరో కోడలు, బట్టను ఉన్నపాళంగానే ఆరేసేది. అదేమంటే, "మామగారు మడిబట్టను ఉతికి ఆరెయ్యమనలేదే!" అనేది.

అత్తగారు ఏ కోడలినన్నా అంట్లు తోమమంటే, ఆ కోడలు అంట్లు తోమి కడగకుండా వదిలేసేది.

ఆ కోడళ్ళ తిరుగుబాటు చాలా దాకా వెళ్ళింది. అత్తగారు మామగారికి అన్నం పెట్టమంటే విస్తట్లో అన్నం మాత్రమే పెట్టి, కూరా, పప్పూ, పచ్చడీ వేసేవాళ్ళు కారు. పొయి మీద నుంచి అన్నంగిన్నె దింపమంటే దింపి, కట్టెలు ఆర్పేవాళ్ళుకారు. పొయి మీద ఏదన్నా మాడుతున్నదేమో చూడమంటే, మాడేదానికేసి చూసి ఊరుకునేవారు. కోడళ్ళ ఈ ప్రవర్తన ముసలి వాళ్ళకు చాలా బాధాకరంగా పరిణమించింది. వాళ్ళు కోడళ్ళను ఏమీ అనక కొడుకులతో చెప్పుకున్నారు. కొడుకులు అంతా విని, "మీరేమీ దిగులు పడకండి. వాళ్ళ సంగతి మేము చూస్తాం," అన్నారు.

వాళ్ళు ముగ్గురూ తమలో తాము మాట్లాడుకున్నారు. వాళ్ళు తమ తమ భార్యలను, "సంక్రాంతి పండగ రాబోతున్నది. ఏం కావాలి?" అని అడిగారు.

"నాకు కంచిపట్టు చీర అంటే ఎంతో ఇష్టం," అన్నది పెద్ద కోడలు.

"నాకు బంగారు గాజులంటే తగని మోజు," అన్నది రెండో కోడలు.



"నాకు చంద్రహారం మీద అమిత సరదా?" అన్నది మూడో కోడలు.

ఇదిజరిగాక ముగ్గురు కోడళ్ళూ సంక్రాంతి పండగ కోసం ఆత్రంగా ఎదురు చూడ సాగారు. మధ్య మధ్య వాళ్ళకు అనుమానం వస్తూ ఉండేది. పెద్దకోడలు తాను కోరిన కంచిపట్టు చీర ఏ రంగుదో చెప్పలేదు. రెండో కోడలు తనకేరకం బంగారుగాజులు కావాలో చెప్పలేదు. మూడో ఆవిడ చంద్ర హారం బిళ్ళలు గుండ్రంగా ఉండాలో, కోలగా ఉండాలో చెప్పలేదు.

వాళ్ళభర్తలు మళ్ళీ ఆ విషయం ఎత్తనే లేదు. ఇంతలో సంక్రాంతి రానే వచ్చింది. పండగ ముందు రోజు ముగ్గురు కొడుకులూ ఏవేవో తెచ్చారుకూడా. పండగ రోజు కోడళ్ళ ఆనందం చెప్పనలవికాదు.

అందరూ సావిట్లో కూర్చుని ఉండగా పెద్ద కొడుకు కంచిపట్టు చీర తెచ్చి తల్లి కిచ్చి, "అమ్మా, నువు ఈ పట్టుచీర కట్టుకో, నా భార్య సంతోషిస్తుంది. దానికి కంచిపట్టు చీర ఇష్టంట!" అన్నాడు.

"దానికి ఇష్టమైతే దానికే ఇవ్వక పోయావా?" అన్నది తల్లి.

"ఏం కావాలి అని అడిగానమ్మా. కంచి పట్టుచీర తనకు ఇష్టం అన్నది గాని కావా లని అనలేదు." అన్నాడు పెద్దకొడుకు.

రెండో కొడుకు తల్లికి బంగారు గాజు లిచ్చి, "పెట్టుకోమ్మా, నీ కోడలికి ఇవంటే తగని మోజుట!" అన్నాడు.

మూడో కొడుకు తల్లికి చంద్రహారం ఇచ్చి అలాగే అన్నాడు.

ముగ్గురు కోడళ్ళ ముఖాలూ అవమానంతో ముడుచుకుపోయాయి. వాళ్ళు దుఃఖం ఆపుకోలేకపోయారు. వాళ్ళు అత్తమామల కాళ్ళమీద పడి, తమకు తగిన శిక్షే అయిం దనీ, క్షమించమనీ అన్నారు.

అత్తగారు కోడళ్ళను బుజ్జగిస్తూ, "మీ వస్తువులు మీరు తీసుకోండర్రా. ఈ వయ సులో నా కివన్నీ కావాలా?" అన్నది.

అటు తరవాత ఆ కోడళ్ళు అత్తమామ లను తల్లిదండ్రుల కన్న ఎక్కువగా చూసు కుంటూ, బుద్ధిగా మసలుకున్నారు.





# స్వయంవరం

దేవగిరిపట్టణాన్ని పూర్వం సుదర్శనసేన మహారాజు పాలించాడు. ఆయనకు ఒకే ఒక సంతానం చంద్రసేన. ఆమె పెరిగి పెద్దదవుతున్న కొద్దీ ఆమె అపూర్వ సౌందర్యం గురించిన వార్తలు దేశ దేశాలకూ వ్యాపించాయి. ఆమెను పెళ్ళాడితే దేవగిరిరాజ్యం కూడా లభిస్తుంది. సౌందర్య లోభమూ, రాజ్యలోభమూ ఒక దాని కొకటి తోడు కావటం చేత అనేక దేశాల రాజకుమారులు చంద్రసేనను పెళ్ళాడాలని ఆత్రపడసాగారు.

రాజుకు చంద్రసేన వివాహం పెద్ద సమస్య అయి కూచుంది. ఆమెను ఎవరికిచ్చి చేసినా, రాజుల మధ్య కలహాలు పెరుగుతాయి; యుద్ధాలు జరుగుతాయి; దేవగిరికే ప్రమాదం కలగవచ్చు. ఈ ప్రమాదాలు రాకుండా ఉండాలంటే స్వయంవరం ఏర్పాటు చెయ్యటం తప్ప మరొక మార్గం లేదు. అయితే ఆ స్వయంవరం ఏ పద్ధతిలో ఏర్పాటు చెయ్యాలన్నది రాజు నిర్ణయించుకోలేకపోయాడు.

రాజు ఈ సమస్యతో సతమతమవుతూ ఉండగా ఒక రత్నాలవర్తకుడు ఆయనకు మరొక సమస్య తెచ్చి పెట్టాడు. ఆ సమస్య ఏమిటంటే:

రత్నాల వర్తకుడు వర్తకం మీద దూర దేశానికి ప్రయాణమవుతూ, దారిలో దొంగల భయం ఉండటం చేత, తాను వెంట తీసుకు పోదలచిన అమూల్యమైన వజ్రాలను మూరెడు పొడుగు చేతికర్రలో పెట్టి, పైకి అతుకు తెలియకుండా చెయ్యమని ఒక వడ్రంగి నిపుణుణ్ణి కోరాడు. వడ్రంగి అందుకు ఒప్పుకున్నాడు. అయితే, వజ్రాలను కర్రలో అమర్చేటప్పుడు వర్తకుడు దగ్గిర ఉండరాదు. కర్రను వర్తకుడికి ఇచ్చిన తరవాత ఒక నెలదాకా, ఆ కర్ర

కె. జె. నన్నిరాజ్



లోని వజ్రాలకు వడ్రంగి జవాబుదారు. ఈ నెల రోజులలోగా వర్తకుడు కర్ర విరిచి చూసిన పక్షంలో, అందులో వజ్రాలు లేక పోతే వాటి ధర వడ్రంగి ఇచ్చుకుంటాడు. ఒక వేళ కర్రలో వజ్రాలు ఉన్నట్టయితే అవి వడ్రంగికి ఇచ్చెయ్యాలి. నెల గడువు దాటినాక కర్ర విరిచి చూసిన పక్షంలో అందులో వజ్రాలు లేకపోతే అందుకు వడ్రంగి జవాబుదారుకాడు.

ఈ షరతులలో ఉన్న చిక్కులు ఆలోచించక వర్తకుడు వాటికి ఒప్పుకున్నాడు. వడ్రంగి వజ్రాలు తీసుకుని కర్ర తయారు చేసి ఇచ్చాడు. వర్తకుడు ఆ కర్రను ఎంతో జాగ్రత్తగా పరీక్షించాడు. దాని లోపల డొల్ల ఉన్నట్టు గాని, అతుకు ఉన్నట్టు గాని కొంచెం కూడా తెలియ రాలేదు. వడ్రంగి తన వజ్రాలు కాజేసి మామూలు కర్ర ఇచ్చాడేమో. కర్ర విరిచి చూద్దామంటే అందులో నిజంగా వజ్రాలుంటే వాటిని పరువు నష్టం కింద వడ్రంగికి ఇచ్చుకోవాలి. అందులో వజ్రాలు లేని పక్షంలో వడ్రంగి వద్ద వజ్రాలు గాని, వాటి ధర గాని రాబట్ట వచ్చు; కాని వర్తకుడి సమస్య మళ్ళీ మొదటికే వస్తుంది. పోనీ, నెల రోజులు గడువూ దాటినాక కర్ర విరిచి చూస్తే, అందులో వజ్రాలు లేకపోతే ఏం చెయ్యాలి? గడువు దాటాక కర్రలోని వజ్రాలకు వడ్రంగి జవాబుదారుకాడు!

రత్నాల వర్తకుడు ఈ సమస్యను తెచ్చి రాజుగారి ముందు పెట్టి, "మహారాజా, ఈ కర్రను విరచకుండా ఇందులో వజ్రాలు ఉన్నదీ లేనిదీ నాకు తెలియజెప్పాలి. కర్రను ఆడించి చూశాను. ఎలాటి చప్పుడూ లేదు," అన్నాడు.

రాజకుమార్తె స్వయంవరం ఏర్పాటు చెయ్యటానికి వర్తకుడి సమస్య బాగా పనికి వచ్చింది. రాజు తన కుమార్తె స్వయంవరం జరుగుతుందని చాటింపు వేయించాడు. రాజకుమార్తెతోబాటు రాజ్యాన్ని కూడా సంపాదించవచ్చునని ఎక్కడెక్కడి రాజకుమారులూ స్వయంవరానికి వచ్చారు.

రాజు వారినందరినీ ఒక భవనంలో సమావేశ పరచి, వడ్రంగి తయారుచేసిన కర్రను ఎత్తి చూపి, ''ఇది ఉత్త కర్రా? లేక ఇందులో ఏదైనా ఇతర పదార్థం దాచి ఉన్నదా? ఈ సంగతి తేల్చి చెప్పి, నిరూపించిన వారికి నా కుమార్తెను ఇచ్చి వివాహం చేస్తాను,'' అన్నాడు.

కర్రను ఒక బల్లమీద ఉంచారు. ఒక్కొక్క రాజకుమారుడే వచ్చి ఆ కర్రను పరీక్షించాడు. అది నున్నగా ఉన్నది. ఎక్కడా అతుకు తెలియటంలేదు.

''ఇందులో ఏమీ లేదు. ఇది మామూలు కర్ర!'' అని చెప్పి రాజకుమారులు తమ తమ స్థానాలలో కూర్చోసాగారు. కొందరికి ఈ పరీక్ష అవమానకరమని తోచి, వారు దాన్ని పరీక్షించను కూడా లేదు.

ఇంతలో ఒక రాజకుమారుడు, సువర్చలనగర యువరాజు, తన స్థానంలో నుంచి లేచివచ్చి, కర్రను పరీక్షించాడు. అతను దాని మధ్యభాగాన్ని రెండు వేళ్ళతో పట్టుకుని చూసి, ''ఇందులో అన్య పదార్థం ఉన్నమాట నిజం. ఒక నీళ్ళ తొట్టి తెప్పిస్తే ఆ సంగతి నిరూపిస్తాను,'' అన్నాడు.

రాజభటులు నీళ్ళతొట్టి తెచ్చి బల్లమీద పెట్టారు. రాజకుమారుడు ఆ కర్రను తొట్టిలో వేశాడు. అది నీటిలో నిలువుగా నిలబడింది. సగంభాగం నీటిలో మునిగి, మిగిలిన కర్ర నీటిపైన తేలుతూ అందరికీ కనబడింది.

''ఇది మామూలు కర్ర అయితే నీటి మీద అడ్డంగా తేలేది. దీని దిగువ భాగంలో బరువు ఉన్న కారణంచేత ఆ భాగం నీటిలో మునిగింది. కర్ర దిగువ భాగంలో ఏదో అదనపు బరువున్నదనటానికి ఇదే రుజువు,'' అన్నాడు సువర్చల యువరాజు.

వర్తకుడూ, రాజుగారూ ఒకేసారి పెద్ద నిట్టూర్పు విడిచారు.

సువర్చల యువరాజుకూ, చంద్రసేనకూ వైభవంగా పెళ్ళి జరిగింది. స్వయంవరానికి వచ్చినవారందరూ వరనిర్ణయం జరిగిన పద్ధతి సక్రమంగా ఉన్నదని తృప్తిపడ్డారు.

వివాహం ముగియగానే వర్తకుడు విదేశాలకు బయలుదేరి వెళ్ళిపోయాడు.



# ఇద్దరు లోభులు

ఒక గ్రామంలో ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. ఒకణ్ణి మించిన పిసినారి మరొకడు. ఒక నాడు తమ్ముడు పక్కవూరు వెళ్ళవలసి వచ్చి, చీకటితోనే లేచిపోయి, చెప్పులు తొడుక్కుని, తలుపు దగ్గిరగా వేసి, ప్రయాణమయాడు.

కొంతదూరం వెళ్ళాక అతను ఇలా అనుకున్నాడు:

“ఇంట్లో దీపం ఆర్పకుండా వచ్చేశాను. అసలే అన్నది మొద్దు నిద్ర. దీపం అలాగే వెలుగుతూంటే ఎంత నూనె ఖర్చయిపోతుందో ఏమో!”

ఇలా అనుకుని తమ్ముడు ఇంటికి తిరిగి వచ్చాడు.

నిద్రలేచి ఉన్న అన్న తమ్ముణ్ణి చూసి, “ఏం తిరిగి వచ్చావు?” అని అడిగాడు.

“దీపం ఆర్పటం మరిచిపోయిన సంగతి జ్ఞాపకం వచ్చింది. నూనె వృథాగా ఖర్చవుతుందని, ఆర్పటానికి వచ్చాను,” అన్నాడు తమ్ముడు.

“పిచ్చివాడా, కొంచెం నూనె కోసం చూశావే గాని, నీ చెప్పులు అరిగి పోవటం గురించి ఆలోచించావా?” అని అన్న అడిగాడు.

—కాళ్ళ గోవిందరావు





# అబూకీర్ అబూసీర్

ఒకప్పుడు అలెగ్జాండ్రియా నగరంలో అబూ కీర్ అనే కలంకారీవాడూ, అబూ సీర్ అనే మంగలివాడూ నివసించేవారు. వారి దుకాణాలు పక్క పక్కనే ఉండేవి.

అబూ కీర్ పరమనీచుడూ, అబద్ధాల కోరూ, పట్టి పాపిష్ఠివాడూనూ. ఎలాటి పాడు పని చెయ్యటానికైనా వాడు సంకోచించే వాడు కాడు. ఎవరన్నా అద్దకం కోసం వస్తే వాడు రంగులు కొనాలని ముందుగానే డబ్బు తీసుకునేవాడు. ఆ తరవాత అద్దకం వెయ్యవలసిన బట్టలే మాయమయేవి. ఖాతాదార్లు ఇచ్చిన డబ్బు కాజెయ్యటమే గాక, వాళ్ళ బట్టలు అమ్మేసి, తినటానికీ, తాగటానికీ, వినోదాలకూ ఖర్చు చేసేవాడు. ఖాతాదార్లు వచ్చి అద్దకం పూర్తి అయిందా అని అడిగితే, ఇదుగో, అదుగో అంటూ తాత్సారం చేసేవాడు. "అల్లా మీద ఒట్టు! నా భార్య నీళ్ళాడింది. నాకు ఊపిరి సలపటం లేదు," అనే, "ఇంటి నిండా బంధువులు వచ్చి ఉన్నారు. రెండు రోజులు ఆగారంటే, మీ పని పూర్తి చేస్తాను," అనే, మరొకటో సాకు చెప్పేవాడు.

ఖాతాదార్లు కొందరు ప్రాణం విసిగి, "నిజం చెప్పు. నా బట్టలు ఏం చేశావు? నీ అద్దకమూ వద్దు, నువ్వూ వద్దు. నా బట్టలు నాకు పారెయ్యి," అని నిలవదీస్తే, అబూ కీర్ మొహమూ, నెత్తీ బాదుకుని, వగల ఏడుపులు ఏడుస్తూ, "నేనేం చేసేది, బాబుగారూ? మీ బట్టలకు రంగు వేసి ఆరేసి, లోపలికి వెళ్ళి వచ్చి చూద్దును గదా, అవి కాస్తా మాయమయాయి. నా పొరుగున ఉన్న మంగలాడి పనే అని నా అనుమానం," అనేవాడు.

ఖాతాదారు కాస్త పెద్ద మనిషి అయితే, "అంతా దేవుడి నిర్ణయం!" అనేసి వెళ్ళిపోయేవాడు; అదే కోపిష్టివాడైతే నడి రోడ్డు

అరేబియన్ కథ

మీదనే కలంకారీవాడితో దెబ్బలాటకు దిగేవాడు.

అబూ కీర్ ఖాతాదార్లు ఎంతోమంది న్యాయాధికారి వద్ద ఫిర్యాదు చేశారు, కాని అబూ కీర్ వద్ద ఎవరూ నష్టపరిహారం పొందలేకపోయారు. ఎందుచేతనంటే వాడి దుకాణంలో జప్తు చెయ్యటానికి ఏమీ ఉండేది కాదు.

అబూ కీర్ ఇలా కొంతకాలం గడిపినాక వాడి ధోరణి అందరికీ తెలిసి పోయింది. అబూ కీర్ అంటే నమ్మకద్రోహానికి మారు పేరు అయింది. వాడికి పొట్ట గడిచే మార్గం లేకుండా పోయింది. ఒక రోజు వాడు మంగలి అబూ సీర్ ఇంటికి వచ్చి తాను తిండికి మాడేదశ వచ్చిందని ఏడ్చాడు.

అబూ సీర్ పేదవాడైనా ధర్మాత్ముడు; గొప్ప నిజాయితీపరుడు. అతను అబూ కీర్ స్థితికి జాలిపడి, ''పొరుగు వాడికి సహాయపడటం ధర్మం. నీకు కాస్త మంచి రోజులు వచ్చేదాకా నా యింటనే ఉండి, ఉన్నంతలో కడుపు నిండా తిను,'' అన్నాడు.

అబూ కీర్ మంగలి ఇంట చేరి తన అవసరాలన్నీ జరుపుకున్నాడు.

ఒకనాడు అబూ సీర్, అబూ కీర్‌తో, "అన్నా, నేను మంగలిపనిలో అసమర్థుణ్ణి కాను. కాని నేను పేదవాణ్ణి కావటం చేత నా దగ్గిరికి జనం రాకుండా ఉన్నారు. నా సంపాదన నీకూ, నాకూ, నా సంసారానికీ చాలకుండా ఉన్నది. అల్లా కటాక్షం ఎలా ఉండబోతుందో మరి!'' అన్నాడు.



దానికి అబూ కీర్, "అన్నా, నీ వృత్తి సరిగా జరగటం లేదంటేనూ, నా వ్యాపారం దెబ్బ తిన్నదంటేనూ, దానికి కారణం ఏమిటనుకుంటున్నావు? ఈ ఊరివాళ్ళు పట్టి దుర్మార్గులు. ఎంతో సంపాదించగలిగి ఉండి కూడా, నువు ఇలా కష్టాలు పడటం ఏమీ బాగా లేదు. ఈ దిక్కుమాలిన దేశం వదిలి పెట్టి మరే దేశానికైనా వెళ్ళామంటే మన విద్యలు రాణిస్తాయి. మనకు మంచి గిరాకీ ఉంటుంది. దేశాలు తిరగటంలో ఎంత ఆనందం ఉన్నది! మహా మహా నగరాలు చూడవచ్చు. రెండు చేతులా ధనం ఆర్జించవచ్చు. దుకాణం మూసేసి మరే దేశానికయినా ప్రయాణం అవుదాం పట్టు!" అన్నాడు.

అబూ కీర్ మాటలు అబూ సీర్‌కు సంగీతంలాగా వినిపించాయి. అతను తన మంగలిపాది సర్దుకుని, ప్రయాణానికి సిద్ధమయాడు. బయలుదేరబోయే ముందు అబూ కీర్ ఇలా అన్నాడు:

"మనం ఇక నుంచీ సహోదరులలాగా ప్రవర్తిస్తామనీ, ఇద్దరి సంపాదనా కలబోసుకుని సమంగా అనుభవిస్తామనీ, ఎవరికి ముందు పని దొరికినా రెండోవాణ్ణి పోషిస్తామనీ ప్రమాణం చేసుకుందాం."

అబూ సీర్ ఇందుకు సమ్మతించాడు. ఇద్దరూ కలిసి కొరాన్ పఠించారు. తరవాత వాళ్ళు తమ వెంట తిండి అయినా తీసుకోకుండా రేవుకు వెళ్ళి, ప్రయాణం కావటానికి సిద్ధంగా ఉన్న పడవ ఎక్కారు.





ప్రయాణం వాళ్ళకు అనుకూలించింది. ప్రయాణీకులు నూటనలభై మంది ఉన్నారు. వారికందరికీ మంగలి అబూ సీర్ ఒకడే. అతను తన మిత్రుడితో, "అన్నా, మనకు తిండి కావాలి గనక, ప్రయాణీకులుగాని, పడవవాళ్ళు గాని క్షౌరం చేయించుకుంటా రేమో చూస్తాను. వాళ్ళు రొట్టె ఇచ్చినా, డబ్బులిచ్చినా మనకు ఉపయోగమేగద!" అన్నాడు.

"తప్పకుండా వెళ్ళిరా!" అని అబూ కీర్ కాళ్ళుచాచి పడుకుని నిద్రకు పడ్డాడు.

అబూ సీర్ ప్రయాణీకుల మధ్యగా తిరుగుతూంటే ఒకడు అతన్ని పిలిచి, తల గొరిగించుకుని, డబ్బు లియ్యబోయాడు.

"అయ్యా, ఈ ప్రయాణంలో డబ్బులు ఎందుకు అక్కరకు వస్తాయి? నాకూ, నా మిత్రుడికీ తిండి లేదు. ఇంత రొట్టె ఇయ్యండి," అన్నాడు.

ప్రయాణీకుడు మంగలికి రొట్టె ముక్కా, జున్నూ, నీరూ ఇచ్చాడు. అబూ సీర్ వాటిని తీసుకుని పడవ పై భాగానికి తిరిగి వెళ్ళి, అబూ కీర్‌ను నిద్ర లేపి, తాను తెచ్చిన ఆహారాన్ని చూపాడు. అబూ కీర్ జున్నుతో రొట్టె తిని, మంచి నీరు తాగేశాడు; అబూ సీర్‌కు ఏమీ మిగల్చలేదు.

అబూ సీర్ రోజల్లా ప్రయాణీకులకు క్షౌరాలు చేసి, ముప్పై రొట్టెలూ, బోలెడంత జున్నూ, దోసకాయలూ, ఇతర తినుబండారాలూ, పదిహేను దిరాములు నగదూ సంపాదించాడు. ఇంతేగాక ప్రయాణీకులందరికీ అతనంటేనూ, అతని పనితనం అంటేనూ మంచి అభిప్రాయం కలిగింది.

అతన్ని గురించి పడవ సరంగుకు త్వరలోనే తెలిసింది. ఆయన అబూ సీర్‌ను పిలిపించి, తాను కూడా క్షౌరం చేయించుకున్నాడు. అబూ సీర్ క్షౌరం చేస్తూ తాను అనుభవించిన దారిద్ర్యం గురించీ, తనపై ఆధారపడి ఉన్న కలంకారీ వాణ్ణి గురించీ సరంగుతో మాటవరసగా చెప్పాడు. సరంగు ఉదారుడు. అబూ సీర్ అంటే ఆయనకు కూడా సద్భావం కలిగింది. ఆయన అబూ

సీర్‌తో, "ఈ ప్రయాణం సాగినన్నాళ్ళూ ప్రతి సాయంత్రమూ నువ్వూ, నీ స్నేహితుడూ వచ్చి నాతో కలిసి భోజనం చెయ్యండి," అన్నాడు.

అబూ సీర్ తిరిగి వచ్చేసరికి అబూ కీర్ నిద్రపోతున్నాడు. అతను లేచి తన పక్కన పోగువేసి ఉన్న ఆహారపదార్థాలు చూసి, "ఇవన్నీ ఎక్కడివి?" అని అడిగాడు.

"అల్లా కటాక్షం!" అన్నాడు అబూ సీర్.

అబూ కీర్ ఆత్రంగా ఆ పదార్థాలన్నిటినీ తిన నారంభించాడు.

"అన్నా, అంతా ఇప్పుడే తినకు. రేపటికి కొంత ఉంచు. అదీగాక పడవ సరంగు గారు మనిద్దరినీ రాత్రికి భోజనానికి పిలిచారు," అన్నాడు అబూ సీర్.

"నేను రాలేనులే. నాకు పైత్య వికారంగా ఉంది. ఈ వస్తువులే కాస్త ఎంగిలి పడతా!" అంటూ తినసాగాడు అబూ కీర్. అతను తినే పద్ధతి భయంకరంగా ఉన్నది; ఆహారం నోట కుక్కుకుని, పెద్ద చప్పుడుతో దిగమింగాడు.

అబూ కీర్ తింటూ ఉండగానే సరంగు గారి మనిషి వచ్చి, వారిద్దరినీ భోజనానికి పిలిచాడు. తనకు పైత్యవికారంతో ఒళ్ళు తూలు తున్నదనీ, రాలేననీ అబూ కీర్ అన్నమీదట అబూ సీర్ ఒక్కడే భోజనానికి వెళ్ళాడు.



అతను సరంగుగారి గదికి వెళ్ళేసరికి సరంగుతో కలిసి భోజనం చేసేవారు మరి కొందరు కూడా ఉన్నారు. ఆహారపదార్థాలు రకరకాలవి వడ్డనకు సిద్ధంగా పెట్టి ఉన్నాయి.

అబూ సీర్‌ను చూసి సరంగు, "నీ మిత్రుడెక్కడ?" అని అడిగాడు.

"సముద్రప్రయాణం అతనికి పైత్య వికారం చేసింది," అన్నాడు అబూ సీర్.

"అది త్వరలోనే పోతుందిలే," అంటూ సరంగు అబూ సీర్‌ను తన పక్కనే కూర్చోబెట్టుకుని వడ్డన చేయించాడు.

భోజనాలు అయిపోయి అబూ సీర్ తిరిగి వచ్చేటప్పుడు సరంగు ఒక పెద్ద పళ్ళెం నిండా భోజనం పెట్టించి అతనికి ఇస్తూ,

"దీన్ని తీసుకుపోయి నీ మిత్రుడికి ఇయ్యి." అని చెప్పాడు.

అబూ సీర్ ఆ పళ్ళెంతో తన మిత్రుడి వద్దకు తిరిగి వచ్చి, "నేను వద్దంటుంటే వినకుండా ఆ సాదా తిండి తిని ఆకలి పాడు చేసుకున్నావు. సరంగుగారు నీ కోసం ఎలాటి భోజనం పంపాడో చూడు. ఇలాటి కబాబ్‌లు ఎప్పుడన్నా తిని ఎరుగుదుమా?" అన్నాడు.

"ఇలాతే!" అంటూ అబూ కీర్ పళ్లెం అందుకుని, ఆకలి మీద ఉన్న తోడేలు లాగా, రెండు చేతులా ఆవురావురని తింటూ, క్షణంలో పళ్లెం ఖాళీ చేసేశాడు.

ప్రయాణం ఇరవై రోజులపాటు ఇదే తీరున సాగింది. అబూ సీర్ రోజూ ప్రయాణీకులకు క్షౌరం చేసి, వారిచ్చినవన్నీ చేర్చి పెట్టేవాడు; రాత్రి పూట సరంగుతో కలిసి విందు ఆరగించేవాడు. అబూ కీర్‌కు తిండీ, నిద్రా తప్ప మరే పనీ లేదు.

ఇరవైఒకటో రోజు ఉదయం పడవ ఏదో కొత్త నగరం రేవు చేరింది. అబూ కీర్, అబూ సీర్ నగరంలోకి వెళ్ళి, ఒక సత్రంలో ఒక చిన్న గది కిరాయికి తీసుకుని, తమకు కావలిసిన చాపలూ అవీ కొనుక్కున్నారు. వీటన్నిటికీ డబ్బు అబూ సీరే ఇచ్చాడు. అబూ కీర్ తన కింకా పైత్యం దిగలేదనటం చేత, అతన్ని గదిలోనే పడుకోమని చెప్పి, అబూ సీర్ తన పొది చంకన పెట్టుకుని, సంపాదన కోసం నగరంలోకి వెళ్ళాడు. అతను ఏ వీధి మూలనో మకాం పెట్టి తన వృత్తి చేసుకున్నాడు. మొదట్లో అతని వద్దకు కూలీలూ, వీధి బేరగాళ్ళూ, గాడిదలను తోలుకునే వాళ్ళూ, మాత్రమే వచ్చారు. కాని రాను రాను అతని పనితనం తెలిసి పెద్ద పెద్ద వర్తకులు కూడా రాసాగారు.

అబూ సీర్ సాయంత్రం దాకా పని చేసి, ఆహారపదార్థాలతో గదికి తిరిగి వచ్చి, రోజల్లా నిద్రపోయిన కలంకారీ వాణ్ణి లేపేవాడు. వాణ్ణి లేపటానికి వేరే ఏమీ చెయ్యనక్కర్లేదు. ఏ వండిన మేకమాంసమో వాడి ముక్కు దగ్గిర పెట్టితే చాలు! తరవాత ఇద్దరూ కడుపు నిండా తినేవారు.

—(ఇంకా వుంది)





# రత్నహారం

ఒక గ్రామంలో ఒక జమీందారూ, ఒక జాగీర్దారూ ఉండేవారు. రెండు కుటుంబాల మధ్యా కొంత స్నేహం ఉండేది.

ఒకరోజు జమీందారుగారి కుమారుడి పెళ్ళి ప్రథానం సందర్భంలో విందు జరిగింది. ఆ విందుకు అనేకమంది అతిథులు వచ్చారు. పెళ్ళికూతురికి పెట్టబోయే నగలను అతిథులందరికీ చూపి, దాచిపెట్టేశారు.

ఈ విందుకు జాగీర్దారూ, భార్యా, పిల్లలూ కొంచెం ఆలస్యంగా వచ్చారు. అందుచేత వాళ్ళు ఆ నగలను చూడలేకపోయారు. జాగీర్దారుగారి కుమార్తె తార ఆ నగలను చూడలేకపోయినందుకు చాలా నొచ్చుకున్నది. ఆ నగలలో రెండులక్షల విలువ చేసే రత్నహారం ఉన్నదని ఆమె లోగడ విని ఉన్నది.

తార జమీందారు కుమార్తె అయిన మాలిని వద్దకు వెళ్ళి, ఆ రత్నహారాన్ని తనకొక్కసారి చూపమని అడిగింది. కాని, గర్విష్ఠి అయిన మాలిని తారకు హారాన్ని చూపకపోగా, ఆమె ఆలస్యంగా వచ్చినందుకు ఎత్తిపొడిచింది.

విందు ప్రారంభమయింది. అందరూ ఫలహారాలు తీసుకుంటున్నారు. ఒక మూలగా ఒక వృద్ధుడు కూర్చుని ఉండటం తార గమనించింది. ఆయన చాలా సాదా అయిన బట్టలు ధరించి ఉన్నాడు. ఆయనను గురించి ఎవరూ పట్టించుకున్నట్టు లేదు. ఆయన జమీందారు వద్ద పూర్వం పని చేసి ఉంటాడనీ, జమీందారు కొడుకు పెళ్ళి ప్రథానం గురించి విని, పిలవకుండానే వచ్చి ఉంటాడనీ తార ఊహించింది.

అలా అనిపించగానే తారకు ఆయన మీద జాలి కలిగింది. ఆమె ఆయనను సమీపించి, "తాతా, మీకు తినటానికి ఏమైనా తెచ్చి పెట్టనా?" అని అడిగింది. ఆయన

హెచ్. సుగుణమణి

ఏమీ జవాబు చెప్పకుండానే తార ఒక పళ్ళెంలో ఫలహారాలు తెచ్చి అయనకు ఇచ్చింది.

ఆయన తారతో, "అమ్మాయీ, రత్న హారం చూపమని నువు మాలినిని అడిగి నట్టున్నావే? నీకు నిజంగానే చూడాలని ఉందా?" అన్నాడు.

"అవును, తాతా. ఆ హారం ఎలా ఉందని స్నేహితురాళ్ళు అడిగితే ఏం చెప్పను?" అన్నది తార.

"అయితే నా వెంటరా, నేను నీకు ఆ హారాన్ని చూపిస్తాను," అంటూ వృద్ధుడు మేడ మీదికి దారి తీశాడు. తార అయన వెంట మెట్లెక్కుతూ, "హారం ఎక్కడ ఉండేదీ మీ కెలా తెలుసు?" అని అడిగింది.

"ఈ ఇంట నాకు తెలియని రహస్య ప్రదేశాలు లేవమ్మా," అన్నాడు వృద్ధుడు.

పైకి వెళ్ళాక అయన ఒక అలమారు సొరుగులో నుంచి ఒక మఖమల్ పెట్టె తీసి, దాన్ని తెరిచాడు. ఆ పెట్టెలోనే రత్నహారం ఉన్నది. అది చాలా అద్భుతంగా ఉన్నది.

"హారం చాలా బాగుంది కదూ? దీన్ని చూసినా నీవు నీ స్నేహితురాళ్ళకు వర్ణించి చెప్పలేవు. దీని బొమ్మ గీసి నీ కిస్తాను," అంటూ వృద్ధుడు తన జేబులో నుంచి ఒక కాగితం తీసి, దానిమీద హారం డిజైను గీసి తార కిచ్చాడు.

తన పని ముగియగానే తారకు, తాను హారాన్ని దొంగచాటుగా చూశానన్న సంకోచం పట్టుకుని బాధ కలిగింది. వృద్ధుడు హారాన్ని



తిరిగి సొరుగులో పెడుతూ ఉండగా, ఆమె వేగంగా కిందికి దిగి వచ్చేసింది.

విందు ముగిసింది. తార తన తల్లి దండ్రుల వెంట తమ ఇంటికి తిరిగి వెళ్ళి పోయింది.

ఇది జరిగిన వెంటనే తారకు జమీందారు గారి ఇంటి నుంచి పిలుపు వచ్చింది. తార అక్కడికి వెళ్ళే సరికి, ఏదో పెద్ద ప్రమాదం జరిగి పోయినట్టుగా అక్కడి వాతావరణం ఆమెకు కనిపించింది.

జమీందారుగారి భార్య తారను ఒంట రిగా ఒక గదిలోకి తీసుకుపోయి, "తారా, నిజం చెప్పమ్మా! నువు రత్నహారం గురించి చాలా మందికి వర్ణించి చెప్పావుట, ఎప్పుడు చూశావు? నువు ఆలస్యంగా వచ్చావనీ, హారం చూడలేదనీ మాలిని అన్నదే!" అన్నది.

"నేను హారాన్ని చూసిన మాట నిజమే నండీ," అన్నది తార.

"ఎలా చూశావు? ఎప్పుడు చూశావు?" అని జమీందారు భార్య అడిగింది.

తార వృద్ధుడి సహాయంతో హారం చూసిన సంగతి జమీందారు భార్యకు వివరంగా చెప్పింది. ఇద్దరూ ఇవతలికి వచ్చేశారు.

జమీందారు భార్య జమీందారుతో, "ఆయనను పిలవవద్దని నెత్తీ, నోరూ కొట్టు కుని చెప్పాను. విన్నారు కారు. చీకు బట్ట లతో వచ్చి మన పరువు తియ్యటమే గాక, రత్నహారం కాస్తా కాజేశాడు. దరిద్రం ఎంత పనయినా చేయిస్తుంది!" అన్నది.





తార బెదురుతూ, "ఆయన ఈ ఇంటి మనిషినే నని చెప్పారండీ!" అన్నది.

"ఇంటి మనిషి కనకనే ఇంతపని చేశాడు!" అన్నది జమీందారు భార్య.

వృద్ధుడికి వీళ్ళు దొంగతనం అంటగట్టటం తారకు బాధ కలిగించింది. ఆయనను దొంగ అనేవాళ్ళు, తారను తోడు దొంగ అనుకోకమానరు. వృద్ధుడు దొంగతనం చెయ్యడని తార నమ్మకం. కాని జమీందారు గారింటో రత్నహారాన్ని వాళ్ళ బంధువే కాజేశాడని అంతా చెప్పుకుంటున్నారు.

వృద్ధుడికి వచ్చిన అపఖ్యాతిని పోగొట్టటానికి ఏదైనా చెయ్యాలని తారకు అనిపించింది, కాని ఆయన ఎక్కడ ఉంటాడో.

ఒకనాడు తార వృద్ధుడు గీసి ఇచ్చిన రత్నహారం బొమ్మ కాగితాన్ని చూస్తూ ఉండగా వెనక పక్కన, "అప్పారావు, రామాపురం" అని అచ్చువేసి ఉండటం కనిపించింది. అప్పారావు వృద్ధుడిపేరు. రామాపురం ఆయన ఉండే ఊరిపేరు. రామాపురం వెళ్ళి, ఆ అప్పారావును కలుసుకుని, ఆయన మీద వచ్చిన అపవాదు చెరితే గాని తారకు నిద్ర పట్టేటట్టు లేదు.

తార సంగతి అంతా తల్లి దండ్రులకు చెప్పి, తన అన్నను వెంట బెట్టుకుని రామాపురానికి వెళ్ళింది. ఆమె ఊహించినట్టు అక్కడ వృద్ధుడు ఉన్నాడు. కాని ఆయన తార అనుకున్నట్టు బీదవాడుకాడు. ఆయన ఉండే ఇల్లు చాలా పెద్దది. ఆయన గొప్ప సంపన్నుడు.

తారను చూడగానే అప్పారావు, ఆశ్చర్యపోయి, "ఏమమ్మా, ఇలా వచ్చావు?" అంటూ ఆహ్వానించాడు.

"తాతగారూ, మీ మీద దొంగతనం ఆరోపించారు. నన్ను కూడా తోడు దొంగను చేసి మాట్లాడుతున్నారు. మీరు మా జమీందారు గారి బంధువేట గదా?" అన్నది తార.

అప్పారావు గట్టిగానవ్వి, "ఆ హారం నేనే దొంగతనం చేశానని మా వాళ్ళు నాకు ఉత్తరం రాశారు. నే నింకా సమాధానం రాయలేదు. ఆ హారం నేనే మరొక రహస్య

స్థానంలో దాచాను. కొంతకాలం వాళ్లను ఏడిపించి, అది ఎక్కడ ఉన్నదీ రాద్దామనుకుంటున్నాను. వాళ్ళు నీ మీద కూడా దొంగతనం ఆరోపిస్తారని ఊహించలేదు,'' అన్నాడు.

"మీకూ వారికీ ఎలాటి బంధుత్వం? వాళ్ళను మీరు ఏడిపించటం దేనికి?'' అని తార ఆయనను అడిగింది.

"మీ జమీందారు నా అన్నే. ఇద్దరమూ ఒక తల్లి బిడ్డలం. నేను యుక్త వయసు వచ్చినదాకా ఆ ఇంటనే పెరిగాను. ఆ యింటి రహస్యాలు నాకు తెలిసినట్టు మా అన్నకు కూడా తెలీవు. మా అన్న జమీందారీకి రాగానే నేను కొద్ది డబ్బుతో బయటికి వచ్చేశాను. తరవాత వ్యాపారం చేసి పది, పన్నెండు లక్షలు సంపాదించుకున్నాను. ఈ సంగతి వాళ్ళకు తెలీదు. నేను ఈ గ్రామంలో స్థిరపడినాకనే మా అన్నకు నా సంగతి తెలిపాను. వాళ్ళు చాలా గర్వపోతులు. సాదా బట్టలతో వస్తే నన్ను ఎలా చూశారో నువే చూశావు గద! వాళ్ళ గర్వం అణచాలనే హారం దాచాను. త్వరలోనే కుర్రాడి పెళ్ళి రాబోతున్నది. అందుచేత దాన్ని ఎక్కడ దాచానో వారికి రాద్దామనుకుంటున్నాను. కాని ఇప్పుడు రాయను. నీకు వాళ్ళు దొంగతనం అంట గట్టారు గనక నీ ద్వారానే వాళ్ళకు ఆ హారం జాడ తెలిసేటట్టు చేస్తాను,'' అన్నాడు అప్పారావు.

ఆయన మరొక కాగితం మీద జమీందారుగారి ఇంటి ప్లాను గీసి, హారం ఉన్న చోటు గుర్తు పెట్టాడు. ఆ కాగితం తీసుకుని, తార అన్నతో సహా తమ గ్రామానికి తిరిగి వచ్చింది.

ఆమె జమీందారుగారి ఇంటికి వెళ్ళి, జమీందారుగారి భార్యతో, "నేనొక చిన్న పరిశోధన చేశాను. మీ రత్నహారం మీ ఇంటనే ఉన్నదని నా నమ్మకం,'' అంటూ ఇల్లంతా తిరిగి, ఫలానిచోట వెతకమని చెప్పింది. ఆమె సూచించిన చోట ఒక రహస్యపు అరలో హారం దొరికింది.

పోయిన రత్నహారాన్ని వెతికి ఇచ్చినందుకు అందరూ తారను మెచ్చుకున్నారు.



# పట్టిందల్లా బంగారం

ఒకనాడు అక్బరుచక్రవర్తి తన అనుచరులతో గుర్రాల మీద నగరం చూడటానికి బయలు దేరాడు. ఒక వీధిలో ఒక పక్కగా ఒక వృద్ధురాలు నిలబడి చక్రవర్తికి కనబడింది. ఆమె చేతిలో ఒక కత్తి ఉన్నది.

అక్బరు ఆమెకు సమీపంగా వెళ్ళి, "అవ్వా, ఈ కత్తి పట్టుకుని ఇక్కడ ఎందుకు నిలబడ్డావు ?" అని అడిగాడు.

"నేను బీదదాన్ని, నాయనా. ఈ కత్తి అమ్ముదామనుకుంటున్నాను," అన్నది ముసలిది.

అక్బరు ఆ కత్తిని తీసుకుని చూస్తే, అది అక్కడక్కడా తుప్పుపట్టి ఉన్నది. దాన్ని ఆయన ముసలి దానికి తిరిగి ఇచ్చేశాడు. ముసలిది ఆయన కేసి నిరాశతో చూసింది.

"ఏమిటి నీ సందేహం ?" అని అక్బరు ఆమెను అడిగాడు.

"ఏమీ లేదు, మహరాజా. మీరు పట్టిందల్లా బంగార మవుతుందంటారు. నా దుర దృష్టం, నా కత్తి ఏమీ మారలేదు," అన్నది ముసలిది.

ముసలి దాని తెలివికి సంతోషించి, ఆమెకు ఇంత బంగారం ఇచ్చి, అక్బరు ముందుకు సాగాడు.

—ఎం. శేషగిరిరావు





# కోటలో పాగా

పూర్వం వంగదేశాన్ని శ్రీకేతుడు అనే రాజు పాలిస్తూ వచ్చాడు. వంగదేశానికి పొరుగున ఉన్న అంగదేశం శత్రురాజ్యం. అంగరాజు వంగదేశాన్ని యుద్ధంలో జయించలేడు. అందుచేత ఆయన వంగరాజు కోటకు గల రహస్యమార్గాలను కనిపెట్టి, మాయోపాయం చేత వంగరాజ్యాన్ని వశపరచుకోవటానికి యత్నాలు చేయసాగాడు. ఇందుకుగాను ఆయన కొందరు గూఢచారులను వంగదేశానికి పంపాడు. అయితే వాళ్ళవల్ల ప్రయోజనం కలగలేదు.

ఇలా ఉండగా వంగదేశపు ఆస్థానపండితుడు చనిపోయాడు. ఆ పదవికి వంగరాజు కొత్త పండితుణ్ణి నియమించే ప్రయత్నంలో ఉన్నాడు. అంగరాజు ఈ అవకాశం వినియోగించుకో దలచి, తన అనుచరులలో పండితుడుగా చెప్పుకోదగిన అంగశాస్త్రి అనే వాణ్ణి శ్రీకేతుడి ఆస్థానానికి పంపాడు.

శ్రీకేతుడు అనేకమంది పండితులను ప్రశ్నించి, వారిలో ఇద్దరిని ఎన్నుకున్నాడు. ఆ ఇద్దరిలో ఒకడు అంగశాస్త్రి, మరొకడు రామశాస్త్రి అనేవాడు. రామశాస్త్రి వంగదేశీయుడు. ఆయన గొప్ప పండితుడు కూడాను. ఆ ఇద్దరిలో ఎవరిని ఆస్థాన పండితుడుగా వేసుకునేదీ మర్నాడు తేల్చి చెబుతానని చెప్పి, శ్రీకేతుడు ఇద్దరినీ పంపేశాడు.

ఆ రోజు సాయంకాలం ఒక పావురం వచ్చి, రాజుగారు మిద్దెమీద విహరిస్తూండగా అక్కడ వాలింది. అది ఒక ఉత్తరం తెచ్చింది. ఆ ఉత్తరంలో ఇలా ఉన్నది:

"ఆస్థానపండితుడుగా రామశాస్త్రినే నియమించాలి. అలా చెయ్యని పక్షంలో శత్రువులవల్ల ప్రమాదం తప్పదు. జాగ్రత్త."

ఈ బెదిరింపు ఉత్తరం చూసి రాజు మండిపడ్డాడు. ఇది రామశాస్త్రి పనే అయి ఉంటుందనుకుని ఆయన తన భటులను

"వైదేహి"



పంపి, రామశాస్త్రిని ఖైదులో పెట్టించాడు. అంగశాస్త్రి తన ఎత్తు పారినందుకు పరమానందం చెందాడు. ఎందుకంటే ఆ ఉత్తరం పంపినవాడు అంగశాస్త్రే.

ఇలా ఎందుకు జరిగినదీ బొత్తిగా అర్థం చేసుకోలేకపోయినవాడు రామశాస్త్రి. ఆయన రాజుగారితో కొద్దిసేపు మాట్లాడటానికి అనుమతి కోరాడు. రాత్రి పొద్దుపోయి రాజు ఖైదులో ఉన్న రామశాస్త్రిని చూడబోయాడు. పావురం తెచ్చిన ఉత్తరాన్ని ఆయన రామశాస్త్రికి చూపించి, "నీ నిర్బంధానికి కారణం ఇదే," అన్నాడు.

రామశాస్త్రి ఆ ఉత్తరాన్ని చాలాసేపు చూసి, "మహారాజా, దీని వెనక మీరు ఊహించని పెద్ద కుట్ర ఏదో ఉన్నట్టు నాకు అనుమానంగా ఉన్నది. ఈ ఉత్తరం నేను రాయలేదు. అది అలా ఉంచండి. దీన్ని నేను రాసే అవసరం కూడా లేదు. ఎందుచేతనంటే ఆ అంగశాస్త్రి నిజమైన పండితుడు కాడు. నాతో అతను పోటీకి ఎలాగూ రాలేదు. అందుచేత ఆస్థాన విద్వాంసుడి పదవి నాకు తప్పక వస్తుందనుకుంటున్నాను. నాకు రాకుండా చెయ్యటానికే ఎవరో ఈ ఉత్తరం పంపి ఉండాలి. అంగశాస్త్రి ఆస్థానపండితుడు కావటానికి ఎందుకు ఆరాటపడుతున్నాడో విచారించటం అవసరం. అతను మనదేశంవాడు కూడా కాడు," అన్నాడు.

రాజుకు రామశాస్త్రి మాటలతో కళ్ళు తెరుచుకున్నట్టు అయింది. ఆయన రామశాస్త్రిని వెంటనే విడుదల చేయబోయాడు.

"వద్దు, మహారాజా. నన్ను కొద్దికాలం ఖైదులోనే ఉండనివ్వండి. అంగశాస్త్రికి ఎలాంటి అనుమానమూ కలగకుండా అతన్ని రేపు ఆస్థాన విద్వాంసుడుగా నియమించండి; అతన్ని అహోరాత్రాలు గమనించటానికి సమర్థులైన వేగులవాళ్ళను అతనిపైన ఉంచండి. అతను శత్రుగూఢచారి అని నా అనుమానం," అన్నాడు రామశాస్త్రి.

రాజు రామశాస్త్రిని ఖైదులో పెట్టించినందుకు పశ్చాత్తాప పడుతూ క్షమాపణ చెప్పుకుని, ఇంటికి తిరిగి వెళ్ళాడు.

మర్నాడు అంగశాస్త్రి దర్బారులో అధికారరీత్యా ఆస్థానపండితుడుగా నియమించబడ్డాడు. ఆయన ఉండటానికి ఒక విడిది ఏర్పాటు చేసి, కొందరు సేవకులను కూడా ఆయన వద్దకు పంపారు. ఆయన తనకు కావలసిన వంటవాళ్ళనూ, ఇతర నౌకర్లనూ ఎన్నుకుంటూ, ఒక భీముడు లాంటి వాణ్ణి కూడా తీసుకున్నాడు.

ఆ భీముడి లాంటి వాడు బాగా కండలు తిరిగిన వాడు, ఎంత బండపనులైనా చెయ్యగలవాడు. అయితే వాడికి పుట్టెడు చెముడు. దానికి తోడు వాడు కొంచెం మందమతి. గట్టిగా అరిస్తేనే గాని వినిపించని ఆ వెర్రిబాగులవాడు తనకు ఎంతో అవసరమని అంగశాస్త్రికి తోచింది.

ఆస్థానపండితుడుగా అంగశాస్త్రిని నియమించిన రోజునే, అంగదేశపు చారులు ఆయనను విడిదిలో చూడటానికి వచ్చారు. అంగశాస్త్రి వెర్రిబాగులవాణ్ణి తప్ప మిగిలిన సేవకులను ఏవో పనుల మీద పంపేసి, తనను చూడవచ్చిన వారితో చిన్నగా, "నేను కోటలో పాగా వేసినట్టు మన రాజుగారికి కబురు పంపండి." అన్నాడు.

ఆ భీముడి లాంటి వాడు చెవిటివాడూ కాడు, వెర్రిబాగులవాడూ కాడు. వాడు రాజుగారు ఏర్పాటు చేసిన చారు లందరిలోకీ ముఖ్యుడు. వాడు ఒక క్షణంపాటు అవతలికి వెళ్ళి, మరొక చారుడి ద్వారా రాజుగారికి వార్త పంపాడు.

అంగశాస్త్రిని చూడవచ్చిన వాళ్ళు వెళ్ళిపోయే లోపలనే రాజభటులు వచ్చి, అంగశాస్త్రితో సహా అందరినీ పట్టుకుని, తిన్నగా బందిఖానాకు తీసుకుపోయారు.

ఆ రోజే రామశాస్త్రిని ఖైదు నుంచి విడిపించి, మర్నాడు సభలో రాజు రామశాస్త్రి చేసిన మహోపకారాన్ని వివరించి, ఆయనను ఆస్థానపండితుడుగా నియమించాడు.

అంగశాస్త్రి, మిగతా చారులూ తాము శత్రురాజు పంపగా వచ్చినవాళ్ళమేనని ఒప్పుకుని, తేలిక శిక్షలు పొంది కారాగృహవాసం అనుభవించారు.



# మూర్ఖ పుత్రులు

ఒక గ్రామంలో ఒక షావుకారుకు ఇద్దరు కొడుకు లుండేవారు. ఇద్దరూ మూర్ఖులే.

ఒక రోజు పొరుగూరి జమీందారు చనిపోయాడు. షావుకారుకు ఒంట్లో బాగా లేక కొడుకులను పిలిచి, "మీరు వెళ్ళి జమీందారుగారి భార్యను పరామర్శించి రండి," అన్నాడు.

చిన్నవాడు, "నేను వెళతాలే, నాన్నా. ఏమని పరామర్శించాలి?" అని అడిగాడు.

"నలుగురూ అనే మాటలూ విని, అవే అంటే సరి!" అన్నాడు షావుకారు.

చిన్న కొడుకు పొరుగూరు వెళ్ళి, జమీందారుగారి ఇంటికి కొద్ది దూరంలో నలుగురు మనుషులు, "చచ్చాడు దుర్మార్గుడు! గ్రామానికి శని విరగడ అయింది!" అనటం విన్నాడు.

వాడు జమీందారుగారింట ప్రవేశించి జమీందారు భార్యతో, "అమ్మా, విచారించ కండి. చచ్చాడు దుర్మార్గుడు! గ్రామానికి శని విరగడ అయింది!" అన్నాడు.

జమీందారు కొడుకులు వాణ్ణి చితకతన్ని పంపారు.

చిన్నవాడికి జరిగినది తెలిసి పెద్దవాడు పరామర్శించటానికి వచ్చి, జమీందారు భార్యతో, "అమ్మా, మా తమ్ముడు అజ్ఞాని. వాణ్ణి క్షమించండి. ఈసారి ఇలాటిది జరిగితే నేనే వచ్చి పరామర్శిస్తాను," అన్నాడు.

జమీందారు కొడుకులు వాణ్ణి కూడా తన్ని పంపేశారు.





# యుక్తిగల దొంగ

వైశాలీనగరంలో గజేంద్రుడని ఒక గజ దొంగ ఉండేవాడు. వాడి యుక్తులను గురించి లోకులు కథలు చెప్పుకునేవారు. వాడు ధనికులను దోచి పేదలకు పెట్టటం చేత దొంగతనాలతో వాడు ధనికుడై పోలేదు. చివరకు వాడు నిజంగా ధనికుడయాడు. కాని అది దొంగతనం ద్వారా కాదు.

ఒకసారి గజేంద్రుడు చాలా దూర ప్రాంతానికి వెళ్ళి, సన్నపుగవ్వలు ఒక సంచిలో వేసుకుని అరణ్యమార్గాన వైశాలీనగరానికి తిరిగి వస్తున్నాడు. గజేంద్రుడి గుర్రం వయసు మీరినది. అందుచేత అది బాగా అలిసిపోయి ఉన్నది.

అరణ్యంలో ఒక చోటికి వచ్చే సరికి చెట్ల చాటునుంచి మరొక బందిపోటు దొంగ తన గుర్రం మీద గజేంద్రుడి దారికి అడ్డం వచ్చి, "ఆ మూట ఇస్తావా, చస్తావా?" అని అడిగాడు.

గజేంద్రుడు వాణ్ణి ఎగా దిగా చూసి, "వెధవమూట! ప్రాణం కన్న ఎక్కువా?" అంటూ తన మూటను రక్కసపొదల మధ్య పారేశాడు.

"అంత పొగరా? నీ సంగతి చెబుతానుండు!" అంటూ దొంగ ఆ మూటను రక్కసపొదల మధ్య నుంచి తీసే ప్రయత్నంలో పడ్డాడు.

ఈలోపల గజేంద్రుడు తన గుర్రం దిగి, దొంగ గుర్రం మీదికి దూకి దాన్ని శరవేగంతో తోలాడు. మంచి వయసులో ఉన్న ఆ గుర్రం క్షణంలో గజేంద్రుణ్ణి అతడి ఇంటికి చేర్చింది.

ఆ గుర్రం జీను కింద గజేంద్రుడికి కొంత బంగారం కూడా దొరికింది.

మరొకసారి గజేంద్రుడు నగరంలో ఉన్న పాత్రల దుకాణానికి వెళ్ళి, "చిన్న కాగు కావాలి," అని గట్టిగా అడిగాడు.

ఎస్. రంగారావు

దుకాణం వాడు ఒక చిన్న కాగు తీసి ఇచ్చాడు. గజేంద్రుడు దాన్ని పరీక్షించి, "ఇందులో చిల్లి ఉన్నదండీ!" అన్నాడు.

దుకాణదారు ఆ కాగు లోపలి భాగం అంతా చూసి, "చిల్లి లేదే!" అన్నాడు.

"బయటికి వచ్చి, వెలుతురులో చూడ వయ్యా! చిల్లి లేకపోవట మేమిటి?" అన్నాడు గజేంద్రుడు.

దుకాణదారు బయటికి వచ్చి, కాగును తల కిందులుగా ఆకాశాని కేసి ఎత్తి పట్టి, చిల్లికోసం చూడసాగాడు. గజేంద్రుడు చప్పున ఆ కాగును దుకాణదారు తల మీదికి లాగి, దుకాణంలో ఉన్న గిన్నెలు చేతికి అమరినవి అందుకుని వెళ్ళిపోతూ, "చిల్లి లేకపోతే కాగులో నీ తల ఎలా దూరిందయ్యా?" అని మరీ వెళ్ళాడు.

ఇంకొకసారి గజేంద్రుడు ఒక ధనికుడి కుమార్తెను దొంగలబారినుండి రక్షించాడు. ఆమె తన కృతజ్ఞతను తెలుపుకుంటూ, "నేను నీకు ఏమి ప్రత్యుపకారం చెయ్య గలను?" అన్నది.

"నన్ను పెళ్ళి చేసుకో," అన్నాడు గజేంద్రుడు.

గజేంద్రుడు మోసగాడనీ, దొంగ అనీ, ధనికులను దోస్తూ ఉంటాడనీ ఆమెకు తెలియటం చేత ఆమె అందుకు ఒప్పుకోక, "అది నా వల్ల కాదు," అన్నది.

"నేనంటే నీకు తేలికగా ఉన్నట్టున్నది. నా జన్మలో ఎన్నడూ నేను తీర్చలేని వాగ్దానాలు చేసి ఉండలేదు. నిన్ను పెళ్ళాడటం నాకూ అవమానమే!" అని గజేంద్రుడు ఆమెను పంపేశాడు.

ఈ సంగతి అంతాతెలిసి ఆమె తండ్రి అయిన ధనికుడు తన కుమార్తెను మందలించి, గజేంద్రుణ్ణి తమ ఇంటికి పిలిపించి, అతనికి తన కుమార్తెనిచ్చి పెళ్ళిచేశాడు.

పెళ్ళి అయినాక గజేంద్రుడు దొంగతనాలు చెయ్యలేదు. అతని న్యాయబుద్ధిని గురించి పౌరులు రకరకాలుగా చెప్పుకుంటూ ఉండటం విని, వైశాలీనగరరాజు గజేంద్రుణ్ణి తన కింద న్యాయాధిపతిగా నియమించి ఆదరించాడు.






దుర్వాసుడికీ, ఆయన శిష్యులు వెయ్యి మందికీ, వేళ గాని వేళ, ఎలా భోజనం సమకూర్చాలో తెలీక ద్రౌపది కృష్ణుణ్ణి ప్రార్థించగానే, అరణ్యంలో ద్రౌపది ఎదట కృష్ణుడు ప్రత్యక్షమయాడు.

ద్రౌపది కృష్ణుడి పాదాలకు నమస్కరించి, ''దుర్వాసుడు తన శిష్యగణంతో గంగ నుంచి తిరిగి వచ్చి భోజనం పెట్టమంటాడు. అక్షయ పాత్రలో ఒక్క మెతుకైనా లేదు. నేనేం చేసేది?'' అన్నది.

''దుర్వాసుడి మాట దేవుడెరుగు. ముందు నాకు ఆకలి మండిపోతున్నది. నా ఆకలి తీర్చు,'' అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది సిగ్గుపడుతూ, ''నేను తినేదాకానే పాత్రలో అన్నం ఉంటుంది. నా భోజనం అయి పోయింది. నువే నన్ను పరీక్ష పెడితే నా కేది దారి?'' అన్నది.

''నేను ఆకలితో చచ్చిపోతుంటే నీకు హాస్యంగా ఉన్నట్టున్నది. నీ అక్షయ పాత్రలో ఎంత ఉంటే అంతే పెట్టు. దాన్ని తీసుకురా. చూస్తాం,'' అన్నాడు కృష్ణుడు.

ద్రౌపది వెళ్ళి అక్షయ పాత్ర తెచ్చింది. దానిలో ఏ మూలనో ఒక మెతుకు అంటుకుని ఉన్నది. కృష్ణుడు దాన్ని నోట వేసుకుని, ''నా కడుపు నిండిపోయింది!'' అన్నాడు.

అతను భీముణ్ణి పిలిచి, ''నువు గంగకు వెళ్ళి, దుర్వాసుణ్ణీ, ఆయనగారి శిష్యులనూ భోజనానికి త్వరగా రమ్మని పిలుచుకురా,'' అన్నాడు.

**35. సైంధవ పరాభవం**



భీముడు వచ్చే లోపుగానే దుర్వాసుడికీ, శిష్యులకూ పొట్టలు ఉబ్బరించి, త్రేపులు రాసాగాయి. శిష్యులు దుర్వాసుడి దగ్గిరికి వచ్చి, "స్వామీ, గొంతు పూడేదాకా తిన్నట్టుగా ఉన్నది. మనం అనవసరంగా ధర్మరాజును వంట చేయించమన్నాం. ఒక్క మెతుకు కూడా తినలేం. ఇప్పుడేం చెయ్యాలి ?" అన్నారు.

దుర్వాసుడు వాళ్ళతో, "ధర్మరాజుకు ద్రోహమే చేశాం. అతను సామాన్యుడు కాడు. మన కేసి కోపంగా చూస్తే మాడి, మసి అయి పోతాం. అంబరీషుడి వల్ల నా కొకసారి పరాభవం ఇలాగే జరిగింది. మనం చెయ్యగలది ఒకటే ఉన్నది. ధర్మరాజుకు చెప్పకుండా పారిపోదాం," అన్నాడు. అందరూ గంగ నుంచి అటే వెళ్ళిపోయారు.

అంబరీషుడు ఒకసారి ద్వాదశీవ్రతం చేసి, బ్రాహ్మణులతో సహా భోజనానికి కూర్చోబోతూండగా దుర్వాసుడు వచ్చాడు. అంబరీషుడు అయనను భోజనానికి రమ్మని ఆహ్వానించాడు. దుర్వాసుడు స్నానానికి వెళ్ళి ఎంతకూ రాలేదు. ద్వాదశి ఘడియలు దాటి పోతున్నాయి. ద్వాదశి వెళ్ళాక పారణ చేస్తే వ్రత ఫలితం దక్కదు. అతిథి రాకుండా భోజనం చెయ్యటం పాపం. అందుచేత అంబరీషుడు మధ్య మార్గంగా నీరు తాగాడు. దుర్వాసుడు ఆలస్యంగా వచ్చి, అంబరీషుడు జలపానం చేసినట్టు తెలిసి ఆగ్రహించి, మహాకృత్యను సృష్టించి, అంబరీషుడి పైకి పంపకం చేశాడు. ఇంతలో విష్ణుచక్రం వచ్చి, కృత్యను చంపి, దుర్వాసుడి వెంట బడింది. అప్పుడు దుర్వాసుడు శివుడి వద్దకూ, విష్ణువు వద్దకూ వెళ్ళి, వారు రక్షించ లేకపోగా, తిరిగి వచ్చి అంబరీషుడి కాళ్ళపైనే పడి, ప్రాణాలు దక్కించుకున్నాడు. ఇది దుర్వాసుడికి మరవరాని అనుభవం.

భీముడు గంగా తీరానికి వచ్చేసరికి అక్కడ ఒక్కరూ లేరు. అక్కడ ఉండే బ్రాహ్మణులను అడిగితే, "మునులందరూ

పారిపోయారే!'' అని చెప్పారు. భీముడు ఆశ్రమానికి తిరిగి వచ్చి ఆ మాట చెప్పాడు. దుర్వాసుడు మళ్ళీ ఏ వేళగాని వేళ వస్తాడోనని ధర్మరాజు భయపడ్డాడు.

కృష్ణుడు ఆయనతో, ''దుర్వాసుడు ఇక రాడు!'' అంటూ జరిగిన సంగతి చెప్పి, సెలవు పుచ్చుకుని తిరిగి వెళ్ళిపోయాడు. కృష్ణుడి అనుగ్రహం వల్ల పాండవులను దుర్యోధనాదులు ఇలాటి కష్టాలకు గురి చేయలేకపోయారు.



కొంతకాలం గడిచింది. పాండవులు కామ్యకవనంలోనే ఉంటూ ఒకనాడు వేటకు వెళ్ళ నిశ్చయించారు. తాము తిరిగి వచ్చే దాకా వారు ద్రౌపదిని తృణబిందుడు అనే ఋషి ఆశ్రమంలో ఉంచి, ఆమెకు తమ పురోహితుడైన ధౌమ్యుణ్ణి తోడు ఉంచారు.

అదే రోజు సైంధవుడు సాళ్వరాజు కుమార్తెను పెళ్ళాడాలని, కొంత సైన్యాన్నీ, అనేకమంది రాజులనూ వెంట బెట్టుకుని, తృణబిందు ఆశ్రమం పక్కగా వెళుతున్నాడు. ఆశ్రమం నిర్జనంగా వున్నది. ఒక పొదరింటి ద్వారం వద్ద ద్రౌపది, మెరుపుతీగ లాగా వెలిగిపోతూ నిలిచి ఉండటం సైంధవుడికి కనిపించింది.

ఆమెను చూడగానే సైంధవుడి కళ్ళు జిగేలుమన్నాయి. అతనిలో మోహం పుట్టుకొచ్చింది. అతను కోటికాస్యు డనే రాజకుమారుణ్ణి పిలిచి, ''ఒరే, ఆ స్త్రీని చూశావా? ఆమెను చూస్తే నాకు ఎక్కడలేని కోరికా కలుగుతున్నది. నాకు సాళ్వరాజు కుమార్తె వద్దు. ఈమె ఎవరి కూతురో, ఎవరి భార్యో, నాతో వచ్చేస్తుందేమో నువు వెళ్లి కనుక్కురా.'' అన్నాడు.

ఆ కోటికాస్యుడు కూడా మానాభిమానాలు లేనివాడే. వాడు ద్రౌపది దగ్గిరికి వచ్చి, ''సుందరీ, నువ్వెవరు? వనదేవతలాగున్న నీకు భర్త ఎవరు? ఏ కులం దానివి? నీ పేరేమిటి? ఈ వనంలో ఒంటరిగా ఎందుకున్నావు? మా సంగతి నువు అడగకపోయినా చెబుతాను. నేను సురథ రాజు కొడుకును, నా పేరు కోటికాస్యుడు.



ఆ కనబడే రాజులు త్రిగర్తరాజూ, కుళింద రాజూనూ. నీ వంక ఆత్రంగా చూస్తున్న యువకుడు సుబలరాజుకుమారుడు. పన్నెండుమంది రాజుల మధ్య వెలిగిపోతున్న రథం మీద కూర్చున్నవాడు సింధు సౌవీర దేశాలకు రాజు, జయద్రథుడు. ఆ జయద్రథుడే నీ సంగతి కనుక్కొరమ్మని నన్ను పంపించాడు," అన్నాడు.

ద్రౌపది అతనితో, "నువు ఎవరో నాకు తెలుసు. నా వంటి కులస్త్రీలు నీతో మాట్లాడరాదు. కాని నీ ప్రశ్నలకు జవాబు చెప్పటానికి ఇక్కడ ఎవరూ లేరు. అందుచేత విధి లేక నేనే చెబుతున్నాను. నేను ద్రుపద రాజు కూతురిని. నన్ను కృష్ణ అని పిలుస్తారు. పాండవులు నా భర్తలు. వారిప్పుడు వేటకు పోయి ఉన్నారు, త్వరలోనే వస్తారు. వారు వచ్చేదాకా మీరంతా ఆగి, వారి అతిథి సత్కారాలు పొంది వెళ్ళండి. వారు సంతోషిస్తారు," అన్నది.

కోటికాస్యుడు వెళ్ళి సైంధవుడితో సంగతి అంతా చెప్పాడు.

"ఆమె మనుష్య స్త్రీ అంటే నమ్మశక్యం కాకుండా ఉన్నది. ఆమెను చూసిన కళ్ళతో మరొక స్త్రీని చూడటం సాధ్యం కాదు," అన్నాడు సైంధవుడు.

"అలా అయితే ఆమెను రథంలో ఎక్కించుకుని ఇంటికి వెళ్ళిపో," అన్నాడు కోటికాస్యుడు.

సైంధవుడు తన రథం దిగి, తన వారిని ఆరుగురిని వెంట బెట్టుకుని పాండవుల పర్ణశాలకు వెళ్ళి, ద్రౌపదితో, "నువూ, నీ భర్తలూ క్షేమంగా ఉన్నారా?" అని అడిగాడు.

ద్రౌపది అతన్ని క్షేమసమాచారా లడిగి అర్ఘ్యపాద్యాలిచ్చింది. ఆమె అతన్ని కూర్చోమని, "పాండవులు వేట నుంచి తిరిగి వచ్చి, వేట మాంసంతో భోజనం పెడతారు," అన్నది.

"అతిథ్యాని కేముందిగాని, నా రథం మీద మా నగరానికి వచ్చెయ్యి. నిన్ను నా భార్యగా చేసుకుని, సుఖాలలో ముంచి

ఎత్తుతాను. రాజ్యభ్రష్టులైన పాండవుల వెంట ఈ అరణ్యాలలో ఎందుకు ఇక్కట్లు పడతావు? సింధు సౌవీర దేశాలను నువే ఏలుకో!" అన్నాడు సైంధవుడు.

ద్రౌపదికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. తన భర్తలు వచ్చేదాకా సైంధవుణ్ణి మాటలలో పెట్టదలచి ఆమె, "నువు ఎంత తెలివి మాలినవాడివి! నా భర్తలు ఇంద్రుడికి తీసిపోనివాళ్ళు కదా. వారికి ఆగ్రహం తెప్పించటం నీకు ఎంత ప్రమాదకరం!" అంటూ ధర్మాలు చెప్పసాగింది.

"పాంచాలీ, పాండవులను గురించి మాకు కొత్తగా చెప్పి భయపెడదామనుకుంటున్నావా? లాభం లేదు. లోకంలో ఉన్న పదిహేడు ఉన్నత కులాలలో మాది ఒకటి. ఊరికే మాటలలో పెట్టక, నా వెంట వచ్చెయ్యి. పాండవులకు భయపడి నిన్ను వదిలి పోతాననుకోకు," అన్నాడు సైంధవుడు.

ద్రౌపది మండిపడి, "ఓరీ, అధముడా, పాండవుల భార్య నీకు అంత సులువుగా చిక్కుతుందనుకుంటున్నావా? నీ వెనకగా అర్జునుడు రథంమీద వచ్చి, నిన్ను కార్చిచ్చులాగా దహించడా? నన్ను తీసుకుపోవటం ఇంద్రుడి తరం కూడా కాదు, నువ్వెంత? నేనై నిన్ను వరిస్తాననుకోవటం భ్రమ. నేను మహా పతివ్రతను. నా మనసు పాండవుల పైన తప్ప ఇతరులపైన పోదు," అన్నది.



సైంధవుడి వెంట వచ్చినవాళ్ళు ద్రౌపదిని పట్టుకోబోయారు. ద్రౌపది వాళ్ళకు చిక్కకుండా, ధౌమ్యుడికి వినిపించేటట్టు గట్టిగా కేకలు పెట్టింది. సైంధవుడు ఆమెను రెండు చేతులా పట్టుకుని ఎత్తి పరిగెత్తసాగాడు. ద్రౌపది కేకలు విన్న ధౌమ్యుడు సైంధవుడి వెనకగా పరిగెత్తుకుంటూ రాసాగాడు. ఆయన కూడా కేకలు పెట్టాడు.

సైంధవుడు ద్రౌపదిని రథం మీద ఎక్కించుకుని బయలుదేరాడు.

ధౌమ్యుడు సైంధవుడితో, "సైంధవా, ఏం పని ఇది? చేతనైతే ఆమె భర్తలను ఓడించి ఆమెను పట్టుకుపో గాని, పరస్త్రీని ఇలా బలాత్కారంగా తీసుకుపోవచ్చునా?"



అన్నాడు. సైంధవుడు వినిపించుకోక రథాన్ని పోనిచ్చాడు. ధౌమ్యుడు ఆ రథం వెనకగా పరిగెత్తాడు.

ఈలోపుగా పాండవులు కొన్ని మృగాలను వేటాడి ఒక చోట కలుసుకుని, ఆశ్రమానికి బయలుదేరారు. వారు ఆశ్రమం చేరేసరికి ద్రౌపది కనిపించ లేదు. సారథి అయిన ఇంద్రసేనుడికి ధాత్రేయిక అనేది ఏడుస్తూ కనిపించింది. ఆమె ఇంద్రసేనుడితో ద్రౌపదిని సైంధవుడు బలాత్కారంగా రథంలో పెట్టుకుని తీసుకుపోయాడనీ, అది జరిగి ఎంతో సేపు కాలేదనీ చెప్పింది.

ధర్మరాజు ధాత్రేయికతో ఏడవ వద్దని చెప్పి, తన తమ్ములతో వెంటనే సైంధవుడి మీదికి పోదామన్నాడు. అయిదుగురూ రథాలెక్కి, సైంధవుడి సేనలు వెళ్ళిన జాడలను బట్టి బయలుదేరారు. త్వరలోనే వారికి దుమ్ము రేగుతూ దూరాన కనిపించింది. తరవాత వారికి ధౌమ్యుడు పరిగెత్తుతూ కనిపించాడు. ఆయనను నింపాదిగా రమ్మని చెప్పి, పాండవులు మాంసం మీదికి ఉరికే డేగల్లాగా సైంధవుడి సేన మీదికి ఉరికారు.

సేన మధ్యలో రథం మీద సైంధవుడి వెంట ద్రౌపది కనిపించగానే వారికి ఒళ్ళు తెలియని కోపం వచ్చింది. "ఆగండి! ఆగండి!" అని కేకలు పెడుతూ వాళ్ళు సైంధవుడి రథాన్ని చేరుకున్నారు. వారిని చూసి సైంధవుడి వెంట ఉన్నవారు భయపడ్డారు.

ద్రౌపది సైంధవుడితో, "అరుగో, నా భర్తలు వస్తున్నారు. నువ్వూ, నీ సైన్యమూ సర్వనాశనం కాబోతున్నది. నీకు కాలం మూడటం చేతనే ఈ పాడు పని చేశావు. ఈసారి నువు చావక బతికావంటే అది నీకు పునర్జన్మే అనుకోవాలి," అన్నది.

పాండవులు సైంధవుడి సేనమీద బాణ వర్షం కురిపించారు. సైనికులు చెల్లా చెదరుగా పారిపోసాగారు. భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి పోబోతే కోటి కాస్యుడు అడ్డపడ్డాడు. వాడికి సహాయంగా చాలా రథికులు వచ్చి, భీముడి మీద

శక్తులూ, తోమరాలూ, ఇతర ఆయుధాలూ విసిరారు.

అర్జునుడు సైంధవుడి రథాన్ని చేరుకునేటందుకు దారిలో అడ్డు వచ్చిన పదిహేను మందిని చంపేశాడు. ధర్మరాజు నూరుగురు సౌవీరులను చంపాడు. నకులుడు రథం నుంచి దిగి సైనికులను చంపసాగాడు. సహదేవుడు ఏనుగుల మీద ఎక్కిన వారందరినీ చంపాడు. త్రిగర్తరాజు ధర్మరాజు చేతిలో చచ్చాడు.

సైంధవుడి పక్షంవాళ్ళు చాలామంది చచ్చారు. కోటికాస్యుడు పారిపోయాడు. చివరకు చేసేది లేక సైంధవుడు ద్రౌపదిని రథం మీదనే విడిచి, తాను ప్రాణాలు దక్కించుకుని పారిపోబోయాడు. అర్జునుడు ఆ సంగతి భీముడికి చెప్పాడు. భీముడు అనాథలైన సైనికులను చంపటం నిలిపి, ధర్మరాజుతో, "అన్నా, నువు ద్రౌపదినీ, ధౌమ్యుణ్ణీ నీ రథంలో ఆశ్రమానికి తీసుకుపో. నేనూ, అర్జునుడూ వెళ్ళి ఆ సైంధవుడి సంగతి తేల్చుతాము," అన్నాడు.

"భీమసేనా, సైంధవుడు ఎంత దుర్మార్గుడైనా వాణ్ణి చంపవద్దు. దుశ్శల విధవ కారాదు, గాంధారికి శోకం తెప్పించరాదు," అని ధర్మరాజు భీముణ్ణి హెచ్చరించాడు. కాని ద్రౌపది మాత్రం సైంధవుణ్ణి ప్రాణాలతో వదలరాదన్నది. ధర్మరాజు ఆశ్రమానికి తిరిగి వెళ్లాడు.

ఒక కోసు దూరాన భీమార్జునులకు సైంధవుడు దొరికాడు. భీమార్జునులు సైంధవుణ్ణి పట్టుకుని, తల గొరిగి, పంచ శిఖలు పెట్టి, వికారంగా తయారు చేసి, మట్టి కొట్టుకుని ఉన్న ఆ సైంధవుణ్ణి రథంలో పెట్టుకుని ఆశ్రమానికి తెచ్చి ధర్మరాజు ముందు పెట్టారు.

"ఇక ముందు నువు ఎక్కడికి వెళ్లినా పాండవదాసుణ్ణి అని చెప్పుకు బతుకు," అని భీముడు, ద్రౌపది అంగీకారంతో సైంధవుణ్ణి వదిలిపెట్టాడు.

"ఇక ఎన్నడూ ఇలాటి నీచపు పని చెయ్యకు," అని మందలించి, ధర్మరాజు సైంధవుణ్ణి పంపేశాడు.





# శివపురాణం

## 12

శివుడి ఆజ్ఞ చొప్పున నందీశ్వరుడు వెళ్ళి, బ్రహ్మ విష్ణు ఇంద్రాది దేవతలనూ, గంగా తీరం నుంచి కుమారస్వామినీ కైలాసానికి పిలుచుకు వచ్చాడు. కుమారస్వామి తన తల్లులైన ఆరుగురు కృత్తికలనూ వెంట బెట్టుకుని, పుష్పక విమానంలో వచ్చాడు.

పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామికి ఎదురు వెళ్ళి, కౌగలించుకుని తీసుకువచ్చి, సభలో తమ సమీపాన కూర్చొబెట్టుకున్నారు.

అప్పుడు బ్రహ్మ కుమారస్వామి సమీపంలో నిలబడి, "పార్వతీ పరమేశ్వరులారా, ఈ కుమారుడు ఇవేళ కైలాసానికి వచ్చాడు. రేపు అతన్ని దేవసేనలకు సేనాపతిగా అభిషేకించటం బాగుంటుంది," అన్నాడు.

ఈ మాటకు సభలో అందరూ సంతోషించారు. పార్వతీ పరమేశ్వరులు దేవతలందరి సమక్షంలో కుమారస్వామికి ఉపనయనం చేశారు. అనంతరం బ్రహ్మ పురోహితుడుగా ఉండి, కుమారస్వామిని దేవసేనకు సేనాపతిగా అభిషేకం జరిపాడు.

పార్వతీ పరమేశ్వరులు కుమారస్వామితో, "నాయనా, నువు ఇప్పుడు దేవతల సేనాపతివి. నువు దేవేంద్రుడికి అండగా ఉండి, ముూడులోకాలనూ ఆపదల నుంచి కాపాడాలి. దుర్మార్గులనూ, పాపాత్ములనూ సంహరించాలి. గొప్పవాడివి అనిపించుకుని, గౌరవం పొందాలి," అన్నారు.

స్వర్గంలో విశ్వకర్మ చేత కుమారస్వామికి తగిన భవనాలు కట్టించారు.

పార్వతీ పరమేశ్వరులు కుమారుడితో, "నాయనా, నీ కోసం భవనాలు సిద్ధంగా ఉన్నాయి. నువు వెళ్ళి వాటిలో నివాసం ఏర్పరచుకో," అన్నారు.

అట్ట చివరి బొమ్మ



పార్వతీదేవి కుమారుడికి దేవీగణాలను కూడా ఇచ్చింది. దేవతలు కుమారుడికి అనేకమైన వరాలూ, అస్త్ర, శస్త్ర, ఆయుధాలూ ఇచ్చి, తారకుణ్ణి సంహరించమని ఆశీర్వదించారు.

తరవాత కుమారస్వామి పార్వతీ పరమేశ్వరులకూ, బ్రహ్మ, విష్ణు, ఇంద్రాది దేవతలకూ మొక్కి, తన గణాలతో, "మీరు తారకుడి పట్టణాన్ని ముట్టడించటానికి తగిన సన్నాహాలు చెయ్యండి," అని చెప్పి రణభేరీ వేయించి, స్వర్గపట్టణానికి వెళ్ళి, తనకోసం నిర్మించిన భవనాలలో ప్రవేశించాడు.

అక్కడ శోణితపురంలో తారకుడికి వార్తలన్నీ అందాయి. శివుడి వీర్యాన పుట్టిన కుమారస్వామిని దేవతలు తమ సేనాపతిగా చేసుకుని, తనను చంపించటానికి సిద్ధంగా ఉన్నారు.

తారకుడు తన మంత్రులనూ, సేనానాయకులనూ రప్పించి, "మన నగరం మీద దాడి జరగబోతున్నట్టు చారుల వలన తెలిసింది. మీరు కూడా ఆ దాడిని ఎదుర్కొనటానికి తగిన ప్రయత్నాలు చెయ్యండి," అని చెప్పి పంపివేశాడు.

తరవాత, శివభక్తుడైన తారకుడు పార్థివ లింగాన్ని తయారుచేసి, పూజకు అవసరమైన పంచబిల్వాలనూ, కొబ్బరికాయలనూ, పంచామృతాలనూ, పూలనూ, ఫలాలనూ, సుగంధాలనూ సిద్ధం చేసుకుని, షోడశోపచార పూజలు చేసి, అభిషేకాలు జరిపి, ధూపదీపనైవేద్యాలు పెట్టి, "ఈశ్వరా, నిన్ను పూజించాను. పూజకు తగిన ఫలితం ప్రసాదించు," అని దణ్ణం పెట్టాడు.

అక్కడ స్వర్గంలో కుమారస్వామి, దేవతల గురువైన బృహస్పతి పెట్టిన ముహూర్తంలో రణభేరి వేయించి, దేవ, రుద్ర, వీరభద్ర, దేవీ గణాలతో యుద్ధానికి బయలుదేరాడు.

కుమారస్వామి దేవేంద్రుడు మొదలైన వారితో శోణితపురాన్ని చేరి, నగరాన్ని ముట్టడించి, శిబిరం ఏర్పాటు చేయించాడు. అతను శిబిరం మధ్యలో దేవేంద్రుడు



మొదలైన వారితో సహా కూర్చుని, "యుద్ధానికి ముందు సంధి ప్రయత్నం చెయ్యటం ఉత్తమమని చెబుతారు. ముందు సంధి రాయబారం పంపుదాం. దీనికి మీరేమంటారు?" అని అడిగాడు.

దానికి దేవేంద్రాదులు సమ్మతించారు. అప్పుడు కుమారస్వామి, తన వక్షస్థలం నుంచి పుట్టిన విశాఖుణ్ణి చూసి, "విశాఖా, నువు తారకుడి సభకు వెళ్ళి, నా మాటగా ఇలా చెప్పు. తారకుడి సమాధానం తెలుసుకుని తిరిగిరా!" అంటూ విశాఖుడికి తన మాటలు చెప్పాడు.

విశాఖుడు వెళ్ళేసరికి తారకుడు సభ చేసి తన నగరం ముట్టడి గురించి ఆలోచనలు జరుపుతున్నాడు. అతను విశాఖుణ్ణి చూసి, "నువు ఎవరు? ఏం పనిమీద వచ్చావు?" అని అడిగాడు.

విశాఖుడు అతనితో, "తారకా, నువు శివభక్తుడివి. శివపుత్రుడైన కుమారస్వామి నీ వద్దకు నన్ను రాయబారిగా పంపాడు," అన్నాడు.

తారకుడు సంతోషించి విశాఖుణ్ణి కూర్చోమని, "నాతో కుమారస్వామి ఏమి చెప్పమన్నాడు? నాకు దేవతలు విరోధులు గాని, కుమారస్వామి విరోధి కాడు," అన్నాడు.

"తారకా, నువు చాలాకాలంగా మూడు లోకాలూ ఏలావు. నీ పాలనలో లోకాలు సుఖపడలేదు. ఇక నీవు అధికారాన్ని ఇంద్రుడి పరం చేసి, భోగవతీపురానికి వెళ్ళిపో. లేకపోతే కుమారస్వామి నిన్నూ, నీ వారినీ చంపి, ఇంద్రుడికి నీ అధికారాన్ని ఇచ్చివేస్తాడు. ఈ మాట నీతో చెప్పమని కుమారస్వామి నన్ను పంపాడు," అన్నాడు విశాఖుడు.

తారకుడు మండిపడి, "నేను భయపడి రాజ్యం వదులుకోను. రేపు ఉదయం యుద్ధానికి వస్తున్నాను, సిద్ధంగా ఉండమను!" అని జవాబు చెప్పాడు.

మర్నాడు సూర్యోదయం వేళకు రెండు పక్షాల సేనలూ యుద్ధానికి సిద్ధమయాయి. ఉభయపక్షాల వారూ ప్రాణాలకు తెగించి

పోరాడారు. తారకుడి పక్షాన బాణాసురుడూ, ప్రలంబాసురుడూ, జంభాసురుడూ, అతిబలుడూ, శంభాసురుడూ, కుంభాసురుడూ మొదలైన వీరులున్నారు. కుమారస్వామి పక్షాన అతనితోపాటు వీరభద్రుడూ, అగ్నిహోత్రుడూ, ధర్ముడూ, సూర్యచంద్రులూ మొదలైనవారున్నారు.

యుద్ధం చాలా రోజులు జరిగింది, కాని తారకుడు ఓడే సూచనలు కనిపించలేదు. దేవతలకు నీరసం వచ్చేస్తున్నది. వాళ్ళ ధైర్యం పూర్తిగా అడుగంటిన సమయంలో కుమారస్వామి పాశుపతాస్త్రం ప్రయోగించాడు. అది తారకుడి సేనలపై కొన్ని వేల పిడుగులలాగా పడింది. రాక్షససేనలు చెల్లా చెదరయాయి. పారిపోక నిలిచిన వారంతా బూడిద అయిపోయారు.

తారకుడు కోపావేశంతో ఇంటికిపోయి, శివపంచాక్షరీ మంత్రం జపించి, ధ్యానంలో ఉండగా, అశరీరవాక్కు, "తారకా, విచారించకు. నీకు మోక్షం ఇస్తాను," అన్నది. తారకుడు పూజ ముగించి, లింగాన్ని కంఠంలో ధరించి, మర్నాడు తిరిగి యుద్ధానికి వచ్చాడు.

కుమారస్వామి తారకుడితో యుద్ధం చేశాడు. అతను ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా తారకుడు చెక్కు చెదరలేదు. తారకుడి మెడలో ఈశ్వరలింగం ఉండగా అతన్ని ఏ అస్త్రమూ ఏమీచెయ్యలేదని నారదుడు కుమారస్వామికి చెప్పాడు.

ఈ మాటలు గుర్తుంచుకుని కుమారస్వామి తారకుడి మెడలోని లింగాన్ని ఆగ్నేయాస్త్రంతో కొట్టాడు. ఆ లింగం అయిదు ముక్కలై కిందపడింది. సూర్యుడూ, విశ్వకర్మ మొదలైనవారు వెంటనే ఆ ముక్కలను ఏరి తీసుకుపోయి, అయిదుచోట్ల ప్రతిష్ఠించారు. అవే పంచభీమలింగేశ్వరాలు.

తారకుడి మెడలోని లింగం ఎప్పుడయితే ముక్కలయిందో, కుమారస్వామి బ్రహ్మాస్త్రం ప్రయోగించి తారకుణ్ణి సంహరించాడు. దేవీగణాలు తారకుడి సేనలను చంపుతూ రక్తమాంసాలుతింటూ, నృత్యాలు చేశాయి. దేవతలు పుష్పవర్షం కురిపించారు.



# 122. "హూవర్ డామ్"

కొలరాడో నదిపై నిర్మించబడిన ఈ ఆనకట్ట ఎత్తు 726 అడుగులు. (బొమ్మలో తెల్లని అలిచిప్ప లాటి కట్టడం.) దానికి ఎడమ పక్క ఉన్నది నివాడా రాష్ట్రం, కుడి పక్క ఆరిజోనా. ఆనకట్ట పై భాగాన ఉన్న రోడ్డు రెండు రాష్ట్రాలనూ కలుపుతుంది. ఆనకట్ట దిగువన ఉన్న "బుల్లి" కట్టడం విద్యుత్కేంద్రం; అది 20 అంతస్థుల భవన మంత ఎత్తు!



Photo by Hirdayrsh Vimal



బహుమతి
పొందిన వ్యాఖ్య

వేషాలు వేయకు

పంపినవారు:
ఎస్. వెంకటరత్నం

Chandamama, January '72

Photo by S. B. Takalkar



మూర్తిమహల్ రోడ్,
పొన్నూరు

మోసాలు చేయకు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు జనవరి నెల 5 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మార్చి సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
రిపబ్లిక్ వేడుకలు - 1

మూడవ అట్ట:
రిపబ్లిక్ వేడుకలు - 2

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఎదగటానికి టానిక్ నివ్వండి



# ఆరోగ్యానికి పోషక ఆహార మివ్వండి






# షార్కొఫెర్రాల్ నివ్వండి

## అందులో రెండూ ఉన్నాయి! విటమిన్లు, ఖనిజములు మరియు మాల్ట్‌ల పటిష్ఠమైన మిశ్రమం

షార్కో-ఫెర్రాల్ టానిక్ మరియు పోషక ఆహారం కావటంచేత ఎదగటానికి మరియు ఆరోగ్యానికి చాలా శ్రేష్ఠమైనది. ప్రతి స్పూను షార్కో-ఫెర్రాల్, ఏ ఇతర టానిక్ లేక పోషక ఆహారానికన్నా కూడా ఎక్కువగా విటమిన్స్ ఏ, డి మరియు అత్యావశ్యకమైన బి కాంప్లెక్స్ పదార్థములను ఇస్తుంది. ముఖ్యమైన- ఐరన్ మరియు కాల్షియమ్‌లవంటి ఖనిజములను కూడా సమకూర్చుతుంది. 40 సంవత్సరాలుగా డాక్టర్లు షార్కో-ఫెర్రాల్‌ను సిఫారసు చేయటంలో ఆశ్చర్యం లేదు జలుబులు మరియు సూక్ష్మ జీవులద్వారా సాధారణంగా సంక్రమించే అస్వస్థల నుండి కూడా కాపాడుతుంది.

1 కె.జి. మరియు 460 గ్రాములు జార్‌లలో లభిస్తున్నది.

షార్కో-ఫెర్రాల్
భారతదేశపు అత్యంత నమ్మకమైన
అధికంగా అమ్ముడయ్యే మాల్ట్ కల్గిన టానిక్!




అలెంబిక్ కెమికల్ వర్క్స్ కొ. లి.
నాణ్యమైన మందులకు నమ్మకమైన పేరు.

everest/206/ACW TL

కుటుంబము అంతటికి

# ఫోస్ఫోమిన్ ®

వల్ల ఆరోగ్యము కలుగును




ఫోస్ఫోమిన్‌లో విటమిను బి కాంప్లెక్సు మరియు మల్టిపుల్ గ్లిసరోఫాస్ఫేట్లు ఉండుట వలన అది మీ కుటుంబమును బలముగా, చురుకుగా మరియు ఆరోగ్యముగా ఉంచుతుంది. మీయింట్లో శక్తినిచ్చే టానిక్ అగు ఫోస్ఫోమిన్ ఉంటే అలసట మరియు నీరసము అనే మాట ఉండదు. ఫోస్ఫోమిన్ చురుకుదనమును తిరిగి యిస్తుంది, ఆకలిని అధికము చేస్తుంది, శక్తిని పెంపొందిస్తుంది. దేహములో రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది. ఫోస్ఫోమిన్‌తో మీ కుటుంబములో అందరూ ఆరోగ్యముగా ఉంటారు.



ఫోస్ఫోమిన్...
అనుపమ్మైన పండ్ల రుచిగల
విటమిన్ టానిక్



SQUIBB SARABHAI CHEMICALS

Shilpi-HPMA-31A/71 Tel.

